## [illegible]

## అయోధ్యలో రామ జన్మభూమి మందిరం

అయోధ్యరామ జన్మభూమిలో రామమందిర నిర్మాణంలో పాల్గొన్న కరసేవకులీ చిత్రంలో ఉన్నారు. 1992 డిసెంబర్ 6వ తేదీ దృశ్యమిది. ఇటుకలుమోస్తున్నవారు మట్టిని ఎత్తుతున్నవారు, పారా పలుగుపట్టి కరసేవ చేస్తున్నవారు స్త్రీ బాల యువక వృద్ధులెందరో ఇక్కడ పనిచేస్తున్నారు.

వీరంతా హిందూదేశంలోని భిన్నప్రాంతాల నుండి వచ్చారు. దేశంలో రామ మందిరాలెన్నో ఉన్నాయి. వాటినెన్నింటినో విదేశీ దురాక్రమణ దారులు అపవిత్రం చేశారు. ఈనాటికీ ఎన్నో మందిరాలు ఇంకా పూజా పునస్కారాలకు నోచుకోలేదు. రామజన్మ భూమి మందిరం మాత్రం దేశంలో ఒకచోట మాత్రమే ఉన్నది. ఇది హిందువుల పవిత్ర శ్రద్ధాకేంద్రం. అందరిలో సంఘటిత శక్తిని నింపుతున్న మందిరం. దీనిని కూల్చి, అవేగోడల మీద, అవే స్తంభాల మీద 1538లో బాబర్ గుమ్మటాలు పెట్టించాడు. కాని రాముని జన్మభూమి మందిరంగానే హిందువులు భావించి ఆ గుమ్మటాలను తొలగించడానికి 76 పర్యాయాలు ప్రయత్నం చేశారు. ఈ పోరాటం 464 సం॥లుగా జరుగుతూనే ఉన్నది.

స్వాతంత్ర్యం వచ్చిన తరువాత సోమనాథ దేవాలయ పునరుద్ధరణ జరిగినట్లుగా అయోధ్య రామ జన్మభూమి, మధుర కృష్ణ జన్మభూమి, కాశీ విశ్వనాథ మందిరంతో పాటు మతోన్మాదులు శిథిలం చేసిన 33వేల దేవాలయాల పునర్నిర్మాణం జరుగుతుందనుకొన్నారు. కాని హిందువుల మనోభావాలను సంతృప్తీకరణ వాదులైన రాజకీయనాయకులెవరూ ఖాతరుచేయలేదు. దాని కారణంగానే ప్రజలే విదేశీ దురాక్రమణదారుని మతోన్మాద దుందుడుకు చర్య వల్ల మిగిలిన మచ్చను తొలగించాలని 1984 నుండి తీవ్ర ప్రయత్నం చేసి, అనేక ఉద్యమాలు నిర్మించి చివరకు 1992 డిసంబర్ 6వ తేదీన ఆ మచ్చను రూపుమాపారు.

అందులోని రాంలాలా విగ్రహాలను చెక్కు చెదరకుండా భద్రపరచి తాత్కాలిక మందిరాన్ని నిర్మించారు. ఓంకార ధ్వజాన్ని ఎగరవేసి అందరూ తమ వంతు పవిత్ర బాధ్యతగా నిర్మిస్తున్న రామ మందిర భవ్యదృశ్యం ఇది. భవిష్యత్తులో సుదృఢ దివ్య మందిరానికి వేసిన పునాది ఇది.

## రామో విగ్రహవాన్ ధర్మః - రాముడు ధర్మ విగ్రహమూర్తి



# విశ్వహిందు

ధార్మిక, సామాజిక మాసపత్రిక

సంపుటి : 11    సంచిక : 12    ఈశ్వర - మార్గశీర్షం 1997 డిసెంబర్

ప్రధాన సంపాదకులు
**ఆచార్య బి. రామరాజు**

సంపాదకులు
**పింగళి సుందరరావు**

సహసంపాదకులు
**హరినాథశర్మ**

సలహామండలి
**పి.వి.ఎస్. నాయుడు**
**డా॥ కసిరెడ్డి**

చందా వివరాలు

జీవిత సభ్యత్వం :
రూ : 500/-

వార్షిక చందా రూ. 50/-
విడిప్రతి : రూ. 5/-

డి.డి.లు **విశ్వహిందు**
పేరిటనే పంపాలి.

చిరునామా :
**విశ్వహిందు**
4-5-212
విజయశ్రీ భవనం
కోఠి, భాగ్యనగర్ -500095
ఫోన్: 4617799, 591322

ఈ సంచికలో...

1. సంపాదకీయం .... 2
2. శౌర్యదివస్ .... 4
3. పద్యం - ధర్మప్రబోధం .... 6
4. ఇతిహాసాల్లో స్త్రీ .... 7
5. శ్రీ రుద్రమ్ .... 9
6. గీతా జయంతి ఇలా జరుపుకొందాం .... 11
7. తొలి కర సేవకుడు భక్తరామదాసు .... 13
8. గోడలు కూల్చేస్తే .... 14
9. ఎవరి త్రాడు వాడే అల్లుకొంటున్నాడు .... 15
10. ధర్మ సందేహాలు .... 16
11. దీపం జ్యోతి పరబ్రహ్మ .... 17
12. ప్రాంత సమావేశాల విశేషాలు .... 19
13. పని వేగం పెరగాలి .... 20
14. ధర్మం - మర్మం .... 22
15. శ్రీ అరవిందులు .... 23
16. ఇంటికి ఈశాన్యం .... 25
17. శ్రీరాముడే ఆదర్శం .... 26
18. నక్కపిల్ల - సింహం పెంపకం .... 27
19. చూసి నేర్చుకో .... 28
20. వార్తా హైందవం .... 29
21. శ్లోక వ్యాఖ్యానం .... 31
22. సంస్కార భారతి రథయాత్ర .... 32

**ధర్మాన్ని రక్షించు ★ ధర్మం నిన్ను రక్షిస్తుంది.**

**సంపాదకీయం**

# ర్మరక్షణావశ్యకత

అందంగా ఉన్న ఓ తోట.

ఆ తోటలో ఓ చిన్ని గులాబి. మరెన్నో గులాబులు. గులాబుల పరిమళాలు ఆ తోటంతటా వ్యాపించాయి. ఆ తోటలోకి వచ్చిన ఓ వ్యక్తి ఆ పరిమళాల పసందుకు గులాబి దగ్గరికి వచ్చాడు. దాని మీద చేయి వేశాడు.

కస్సున ముళ్లు గ్రుచ్చుకొన్నాయి.

ఏం గులాబీ! ఇంత అందంగా ఉన్నావు. ఇంత పరిమళమున్నది. మరి నీ చుట్టూ ఈ ముళ్ళెందుకు అని అడిగాడు ఆ వ్యక్తి - కుచ్చుకొన్నందుకు నొచ్చుకొంటూ.

ఆ గులాబి, నాకు ముళ్లెందుకున్నాయో నీకు అర్థం కాలేదా అన్న [illegible] చూచి ఇలా అన్నది.

"నేనందంగా ఉన్నది సత్యమే. నా పరిమళాలు అంతటా వ్యాపించడం సహజమే - సత్యమే. ఈ అందం నా సంపద; ఈ గంధం నా సంపద.

నా సంపదను కాజెయ్యాలని ఎందరో వస్తారు. అందుకే నా చుట్టు ముళ్లనే రక్షక కవచంగా ఏర్పాటు చేసుకొన్నాను".... అన్నది గులాబి.

ఈ మాటలు సరిగ్గా హిందూదేశానికి వర్తిస్తాయి; హిందూ ధర్మానికి వర్తిస్తాయి.

ఇది దరిద్రపు గొట్టు దేశమైతే, ఈ ధర్మంలో అపూర్వ మానవమూల్యాలు లేకుంటే ఎవరూ ఈ దేశంపై దురాక్రమణ చేసేవారు కాదు. దేశసంపద దోచుకోవాలి; ధర్మ సౌందర్యాన్ని చితుకగొట్టాలి. ఇదే దురాక్రమణదారుల ఆలోచన.

వారు మనలోని కులాల్ని రెచ్చగొట్టారు; భాషాద్వేషాల్ని రగిలించారు. ప్రాంతీయ తత్త్వాన్ని పెంచారు. విదేశీయులైన ముస్లింల మతవాదాన్ని కావల్సినంతగా పెంచి పోషించి మన దేశాన్నే వాళ్ళు విభజించుకొని పాలించేట్టు చేశారు. మనం పుట్టిన గడ్డ, మనహక్కు భుక్తం ఈ దేశంలో అడుగపెట్టిన విదేశీయుల సొంతమైపోయింది. "హంస్‌కే లియే పాకిస్థాన్- లడ్‌కేలేంగే హిందూస్థాన్...." అని వారిప్పుడు బీరాలు పలికే పరిస్థితికి కారణం దేశనాటి విభజనే.

విదేశీయులు పదిమంది ఏ దేశంలోనైనా తిష్ఠవేసి ఇది మా భూభాగం అంటే పంచి

ఇవ్వడానికి ప్రపంచంలో ఇప్పుడే దేశమైనా సిద్ధంగా ఉందా! ఆ గులాబి ముళ్ళను పెట్టుకొంది! మరి మనమేం పెట్టుకొన్నాం?

ఇక మానవ సంబంధాలను పటిష్ఠ పరిచే మానవధర్మం మనది. ధర్మమంటే ధరించేది. అభ్యుదయ నిశ్శ్రేయసాన్ని కలిగించేది. అలాంటి అమూల్యధర్మాన్ని మనం అనుసరించాల్సి ఉంది. ప్రపంచానికే మార్గదర్శనం చేయాల్సి ఉంది.

అయితే మన ధర్మం ఉత్తమమైందనీ, ఉన్నతోన్నతమైందని ప్రగల్భిస్తే సరిపోదు. అది ఆచరణలో పెట్టాలి. ఆచరణలో పెట్టడానికి ఆధునిక సంస్కర్తలూ -మహోదార్శనికులైన మహర్షి దయానంద, రామకృష్ణ పరమహంస, స్వామివివేకానంద, స్వామిరామతీర్ధ, శ్రీ గాంధీజి, శ్రీ గురుజీ, సద్గురు మలయాళస్వామి తదితరుల బోధనలను ఒంట పట్టించుకోవాలి. విదేశీమతాల మిషనరీ సంస్థల విషవమనాలకు విరుగుడు పోయాలి. విదేశీ చొరబాటుదారులైన సైతాన్ల ఆటకట్టించాలి.

"హిందూదేశ ఔన్నత్యం ధర్మంలోనే ఉంది. హిందూజాతి తన పూర్వీకుల ఉన్నత వారసత్వాన్ని మరిచిపోకుండా ఉంటే భూమి మీద ఏ శక్తీ వారిని నాశనం చేయలేదు."

ఇవి స్వామి వివేకానందుల మాటలు. అవి తుచ తప్పకుండా ఆచరణలో పెట్టవలసిన అవసరమున్నది.

మన వారసత్వాన్ని పరిరక్షించడమే ధర్మరక్షణం. ధర్మరక్షణకు శక్తి పూజారులం కావాలి. శక్తి ఉన్న సింహాన్ని బలి ఇవ్వడానికి ఎవరూ పూనుకోరు. శక్తిలేని గొర్రెలను మాత్రమే బలిస్తారు.

శక్తి ఉండి, ధర్మదీక్షా తత్పరత ఉన్న ఒక వ్యక్తి ముందుకు పోతుంటాడు. అతని కాళ్ళల్లో కట్టెవెట్టి పడగొట్టే విదేశీ ఇజాల భావ బానిస బుద్ధులు, కుహనా సెక్యులరిస్టులు, భోగవాదులు, అన్నం తిన్న ఇంటికే కన్నం వేసే మాతృదేశ ద్రోహులు కొందరీ దేశంలో ఉన్నారు. వీరి సంఖ్య పిడికెడే. వీరు విదేశీ దుష్టశక్తుల అర్థానికి అమ్ముడైనవారు. దగాపడ్డ వారు; దారి తప్పిన వారు; ఎవరో కాదు మన సోదరులే. తాము కూచున్న కొమ్మను తామే నరుక్కొంటున్నామన్న జ్ఞానం కూడ లేనివాళ్ళు. వీరూ సరియైన దారిలోకి రావాలంటే నేతాజీ జైహింద్ తత్త్వం, సావర్కర్ హిందూ రాష్ట్రీయ చింతనం వెనుక ఉన్న ధర్మరక్షణ దర్శనం అవగతమయ్యేట్టు చేయాలి. అందరినీ కలుపుకొని ఈ దేశాన్ని ఈ ధర్మాన్ని రక్షించే మార్గంలో ప్రతి వ్యక్తీ పయనించాలి.

అందుకే హిందూ వీరపుత్రుడవైన నీవు బలోపాసన చేయాలి. సంఘటన ద్వారా బలాన్ని నిర్మించాలి. "సంఘేశక్తిఃకలౌయుగే" అన్నది సత్యమని నిరూపించాలి. ప్రతి ఒక్కరూ ధర్మరక్షణావశ్యకత గుర్తించి వ్యవహరించాలి. *

**విశ్వహిందు - డిసెంబర్, 1997**

పరిషత్ పిలుపు

# శౌర్యదివస్-డిసెంబరు ఆరు

## ఎందుకీ శౌర్యదివస్

1992 డిసెంబర్ 6న రామజన్మభూమి మీద నిర్మించిన విదేశీ బాబరీ మసీదు కట్టడం కూలిపోయింది. హిందువుల శ్రద్ధా కేంద్రం - పవిత్రస్థలం రామజన్మభూమి మందిరం. దానిని అపవిత్రం చేసి, తన సేనాని మీర్‌బాకీ చేత 1528వ సం॥లో విధ్వంసం చేయించి, గుడిమీద గుమ్మటాలు పెట్టించి మసీదుగా ప్రచారం మొదలెట్టించాడు. 464 సం.గా హిందువులు ఈ అవమానాన్ని భరిస్తూనే 76 పర్యాయాలు ఆ గుమ్మటాలు తొలగించే ప్రయత్నం చేశారు. ఈ 76 పర్యాయాలు విదేశీ ముస్లిం మతోన్మాద శక్తులతో పోరాడి లక్షలాది మంది హిందువులు అమరులయ్యారు. 77వ పర్యాయం తమ శౌర్య పరాక్రమాలు ప్రదర్శించి, ఆ విదేశీ బాబరీ కట్టడాన్ని కూల్చివేశారు. అందుకే హిందూ దేశమంతటా ఈ రోజు శౌర్యదివస్ ఉత్సవాన్ని నిర్వహించుకొంటున్నారు.

## స్వయమేవ మృగేంద్రతా

గొఱ్ఱె కసాయివాడి కత్తికెప్పుడూ బలవుతుంది. సింహం వైపు కసాయి కన్నెత్తి కూడా చూడలేడు. "స్వయమేవ మృగేంద్రతా" వాక్యాన్ని ధ్యేయంగా హిందువు ఆచరిస్తూనే ఉన్నాడు. అంతఃకలహాలతో హిందువు బలహీనుడయ్యాడు తప్ప, ఏనాడు తన మట్టి ఈ కన్నతల్లి నేలను విదేశీ దురాక్రమణదారులకు అప్పగించాలనుకోలేదు. నీతీ -న్యాయం- దైవీభావన-మానత్వం అసలేలేని విదేశీ సైతాన్ శక్తులతో పోరాడి తన జన్మభూమిని హిందువు రక్షించుకొంటూనే ఉన్నాడు. అదే శతాబ్దాల "హిందూ శౌర్యచరిత్ర" అవుతుంది. ఈ దృష్టితో హిందువునూ, హిందుత్వాన్ని అధ్యయనం చేస్తే శౌర్యదినోత్సవ నేపథ్యాన్ని సరిగా బేరీజు వేసినవారమవుతాం.

## 1984 నుండి 1992 వరకు

1984 ఏప్రిల్ 7-8 తేదీలలో ఢిల్లీలో ఆరువందల మంది సన్యాసులూ - ధర్మాచార్యులు ధర్మసంసద్‌లో పాల్గొన్నారు. ఈ సమావేశాల్లోనే అయోధ్యలో శ్రీ రామజన్మభూమి, మధురలో శ్రీకృష్ణ జన్మభూమి, కాశీలో విశ్వనాథమందిరం ఈ మూడింటి పునరుద్ధరణ జరగాలని తీర్మానించారు. దేశమంతటా విదేశీ ముస్లిం మతోన్మాదుల చేత అపవిత్రం చేయబడ్డ ముప్పయివేల మందిరాలను ఆయా ప్రాంతాల్లోని స్థానికులే పూనుకుని పునరుద్ధరించాల్సిన ఆవశ్యకతను సాధువులు వివరించారు. స్వతంత్ర భారతంలో కూడా తనదేశంలోని గుడిని బాగుచేసుకోలేని దౌర్భాగ్యాన్ని ధర్మాచార్యులు నిరసించారు. ఆ సమావేశాల తర్వాత

1985లో జరిగిన ధర్మసంసద్ మరొకసారి ఈ అంశాలనే పునరుద్ఘాటించింది. 1986లో శ్రీరామజన్మభూమి న్యాస్ ఏర్పడింది. 1986 ఫిబ్రవరి 1వ తేదీన రామజన్మభూమి తాళాలు తొలగించవలసిందిగా ఫైజాబాదు న్యాయస్థానం తన తీర్పులో ప్రభుత్వాన్ని ఆదేశించింది. ఆ రోజు నుండి రామజన్మభూమి మందిరంలో లక్షలాది మంది హిందువులు బాలరాముణ్ణి దర్శించుకుంటూ వస్తున్నారు.

ఈ దర్శనానంతరం "ఎన్నాళ్లీ విదేశీలుతేరా గుమ్మటాలు ఈ జన్మభూమి మందిరం మీద" - అనే ప్రశ్న ప్రతి హిందువు మదిలో మెదిలేది. దేశానికి స్వాతంత్ర్యం వచ్చిందా? అసలు హిందువుకు స్వాతంత్ర్యం వచ్చిందా అని అవమానంతో క్రుంగిపోయేవారు కొందరు, జన్మభూమిలోని విదేశీ దురాక్రమణదారుని కట్టడాలను విదేశాలకు పంపించి వేయాల్సిందే అని ఆగ్రహించే వారు కొందరు. ఈ విధంగా వ్యక్తి వ్యక్తిలో భావాగ్ని రగుల్కొంటూ వచ్చింది.

దేశమంతటా శిలాపూజలు జరిగాయి. గంగాజల యాత్రలు నిర్వహించబడ్డాయి. శ్రీ రామజ్యోతి యాత్రలు నిర్వహించబడ్డాయి. శ్రీ రామజన్మభూమి మందిర నిర్మాణానికి తనుమనధనాలతో సేవలందించడానికి లక్షలాది మంది కార్యకర్తలు సంసిద్ధమయ్యారు. 1989 నవంబరు 10వ తేదీన సంత్ శిరోమణి పూజ్య వామదేవ్‌జీ మహారాజ్ భూమి పూజ చేశారు. రామభక్త హరిజన బంధువు శ్రీ కామేశ్వర చౌపాల్ శిలాన్యాసం చేశారు. 1991 ఏప్రిల్ 4వ తేదీన ఢిల్లీలోని బోటు క్లబ్ మైదానంలో 25 లక్షల మంది కరసేవకుల బ్రహ్మాండమైన ర్యాలీ జరిగింది. 1992 అక్టోబర్లో ఐదవ ధర్మసంసద్, శ్రీ రామజన్మభూమి న్యాస్ మంచ్ ప్రభుత్వానికి చివరిసారిగా హెచ్చరిక చేసింది. ప్రభుత్వం మాటలతో మభ్యపెట్టాలని చూచింది. ఈ తాత్సారం వీరహిందూ ప్రజానీకం సహించలేకపోయింది. 1992 డిసెంబర్ 6న విదేశీ దోపిడీ దురాక్రమణ దార్లైన బాబరీ కట్టడాన్ని నేలకూల్చివేసి, అప్పటికప్పుడే అక్కడ రామజన్మభూమి మందిరాన్ని నిర్మించింది. ఆశౌర్య పరాక్రమాల్ని గుర్తుంచుకొని భవిష్యత్తులో భవ్యరామమందిర నిర్మాణానికి, ప్రతి హిందువు శౌర్యంతో తన ధర్మాన్నీ, జాతినీ, దేశాన్నీ, సంస్కృతినీ రక్షించుకునేందుకు, దీక్ష తీసుకునేందుకే దేశమంతటా ఈనాడు శౌర్యదినోత్సవాన్ని నిర్వహించుకొంటున్నారు.

## శౌర్యదినోత్సవంలో పాల్గొనండి !

లెండి! మీ మీ ప్రాంతాల్లో ఈ రోజు శ్రీరామజన్మభూమి రామ్‌లాలాను ధ్యానించండి! ఆలయాల్లో ప్రత్యేక పూజలు నిర్వహించండి! సంకల్పం చేయండి! దీక్షోధారణం చేయండి!

బాలబాలికలకు రామాయణ శ్లోకాలపై పోటీలు నిర్వహించండి! పద్యాలు-గేయాలు పాడించండి! రామచంద్రుని గుణగణాలపై ఉపన్యాసాలిప్పించండి! యోగవాసిష్ఠ రామాయణంలోని తత్త్వాన్ని చెప్పించండి! సభలు నిర్వహించండి! పెద్దలచేత ఉపన్యాసాలిప్పించండి! గుళ్లమీద - గృహాల మీద ధర్మధ్వజాలు ఎగురవేయండి! వీలైనచోటల్లా యజ్ఞాలు నిర్వహించండి. వ్రతాలు చేయండి! పల్లెటూళ్లలో బండ్లపందాలు నిర్వహించండి!

యువకులకు ఆటల పోటీలుపెట్టండి! వ్యాసరచన-వక్తృత్వ పోటీలు ఏర్పాటు చేసి బహుమతి ప్రదానం చేయండి! కోలాటభజన-చెక్కభజన ప్రదర్శించండి! హరికథలు చెప్పించండి! పురాణ ప్రవచనం చేయించండి! సామూహిక రామాయణ పారాయణాలు చేయండి! శ్రీరామభజనలు చేయండి! తత్త్వాలు పాడించండి! ఊరేగింపులు నిర్వహించండి! రామలీలల్ని ప్రదర్శించండి! శ్రీరామబంటు హనుమంతుని శౌర్య పరాక్రమాలు వివరించండి. జై శ్రీరాం - జై బజ్రంగ్‌బలీ అంటూ ముందుకు సాగండి!

ఆయా స్థానిక వనరులను బట్టి ఇలాంటి కార్యక్రమాలెన్నో నిర్వహించవలసినదిగా ఆంధ్రప్రదేశ్ విశ్వహిందూ పరిషత్ పిలుపునిస్తున్నది. ధర్మజాగరణంలో తమ వంతు యోగదానాన్ని అందించవలసినదిగా ఆహ్వానిస్తున్నది.

జై శ్రీరాం

ఈశ్వర సం॥ కార్తిక పౌర్ణమి
1997 నవంబరు 14

విశ్వహిందూ పరిషత్, ఆంధ్రప్రదేశ్

## పద్యం - ధర్మప్రబోధం

మనము మనము కలసినచో / మనమతమును నిల్పవచ్చు, మన దేశమ్మున్
మనది మనది కావచ్చును/మనయనునది మొదలు జీవమార్గమునందున్.

[విశ్వనాథ, శివార్పణం, 5-22]

జయసింగు ఔరంగజేబు వైపున్నాడు. అటువైపు నుండి శివాజి అతణ్ణి హిందుత్వం వైపు త్రిప్పే ప్రయత్నం చేస్తున్నాడు. ఆ సందర్భంలో రాయబారాలు జరిగాయి. అప్పుడు పుట్టింది పై పద్యం.

దేశాన్నీ, దేశ ప్రజల్నీ నానాహింసలకు గురిచేశారు ఎందరో ముస్లిం ప్రభువులు. ప్రజల్ని పీల్చి పిప్పి చేసి "గులాంగిరి" చేయించుకొన్నారు. అధికార పీఠాల చుట్టూ తిరిగి విలాసాల్లో తేలియాడే కొందరు వారి మూతినాకుడు గాళ్లయ్యారు. ఈ విషయాలు జయసింగుకూ అర్థమయ్యాయి. అయితే అతణ్ణి ఇంకా ఒప్పించాలి.

అందుకే - 'మనం మనం కలిసి ఉందాం. అలా కలిసి ఉంటేనే మన మతం నిలుస్తుంది; మనదేశం మనదిగా ఉంటుంది; మనకు స్వాతంత్ర్యం వస్తుంది; విదేశీయులు పరిపాలిస్తున్న మనదేశం మనదవుతుంది. జీవమార్గానికి 'మన' అనేదే మొదలన్నమాట. ఇక్కడ 'మన' అంటే మన ఉనికి, మన దేశం, మన ధర్మం, మన సంస్కృతి, మన మనుగడ, మన జాతి, మన ఆదర్శాలు అని ఇలా ఎన్ని అర్థాలైన చెప్పవచ్చు. గుప్పెడు పద్యంలో గుమ్మెడు అర్థం.

- శాంతిశ్రీ

# ఇతిహాసాల్లో స్త్రీ

-శ్రీమతి డి.జి. విజయలక్ష్మి

ఇతిహాసాల్లో రామాయణ భారతాల గురించి మనందరికీ తెలుసు. సంస్కృత వాఙ్మయంలో మొట్టమొదటి కావ్యం రామాయణం - ఆదికవి వాల్మీకి. ఇందులో ధర్మ స్వరూపుడుగా రాముడు దర్శనమిస్తాడు. రామో విగ్రహవాన్ ధర్మః 'అన్నదందుకే! అతడు తండ్రి మాటకై అడవులకెళ్లి మాట నిలబెడతాడు. తమ్ములను అన్నగా అమితంగా ప్రేమిస్తాడు. భార్యకు భర్తగా హృదయమిస్తాడు. ఆమె కోరికను మన్నిస్తాడు. ఆమె విరహంతో కుమిలిపోతాడు. ఆమె కొరకై అన్వేషిస్తాడు. నమ్మిన మిత్రునికోసం ఏ త్యాగమైనా చేస్తాడు. సీత జాడ తెలియక దైన్యంతో క్రుంగిపోతాడు. ధైర్యంతో ముందుకు దూకుతాడు. వీరుడై విజయం చేపడతాడు. తన ప్రియమైన సీతను అందరూ పునీతగా గుర్తించటం కోసం పరుషంగా మాట్లాడతాడు. ఇవన్నీ సాధారణంగా మానవ స్వభావాలు. బలహీనతల్లో మనల్ని పోలినా బయటపడి ఆదర్శంగా నిలబడతాడు. అయితే అందరూ రాముడ్ని గురించే ఎక్కువగా చెప్తారు. దేవుడిగా ఆరాధిస్తారు. కాని సీతమ్మ కూడ అంతకంటే తక్కువేం కాదు. సర్వసుఖాలు త్యజించి భర్తవెంట అడవులకు నడిచింది. రావణుడు ఎన్ని విధాల ప్రలోభ పెట్టినా, త్రిలోక రాజ్యాన్ని పాదాల ముందు పరుస్తానన్నా తృణీకరించింది. చిన్నబుచ్చినందుకు భర్తనే లక్ష్యపెట్టక, అగ్నిగుండంలోకి నడిచిన మహాభిమానవతి. కనుకనే సీతాయాః చరితం మహత్' అన్నాడా మహాకవి. ఆ మహత్తర చరితాన్నొకసారి మననం చేసుకుంటే - అందులో సీతపాత్ర చిత్రణ మహిళాలోకానికే మణిహారం.

''ఇయం సీతా మమ సుతా సహధర్మచరీతవ'' అంటూ జనకుడు సీతమ్మ చేతిని రామునికప్పగించినప్పటి నుండి ఆమె సహచరియై, ధర్మచరియై రాముడు ధర్మ స్వరూపుడు కావటానికి సహకరించింది. అవసరమనిపించినపుడు సంస్కరించింది. రాముడు అడవికి బయల్దేరినపుడు తాను వెంట వస్తానంటుంది. అడవులలో కష్టాలు పడలేవని రాముడనేక విధాల వారిస్తాడు. స్త్రీకి భర్త తోడిదే లోకం. అతన్ననుసరించడమే ధర్మముంటుంది. కంటకావృత మార్గమని అనుగమనం కష్టమని అడ్డు చెప్తాడు రాముడు. భర్తమాటకు ఎదురాడకూడదని అంతటితో ఆగిపోలేదు సీత. వాదించి వేధించి వెంట నడిచింది. 'శైలూష ఇవ మాం రామ పరేభ్యోదాతుమిచ్ఛసి'' అంటుంది. ఒక ఆటగాడిలాగ నన్ను ఇతరుల కప్పగించి వెళ్తావా అంటూ రెచ్చగొడుతుంది.

**యేత్వయా కీర్తితాదోషాః వనేవస్తవ్యతాం ప్రతి ।**
**గుణానిత్యేవ తాన్వీక్ష్య తవస్నేహపురస్కృతాన్ ॥**

(అయోధ్యకాండ - 29వ సర్గ - 2వ శ్లో)

అంటుంది. నీవు వనవాసములో వుంటాయని చెప్పిన కష్టాలన్నీ నీస్నేహము హరించి వేస్తుంది. నన్ను కూడ వనములకు తీసుకు వెళ్లుమని అర్థిస్తుంది. అయినా

రాముడనుమతించలేదు. ఇక బెదిరించిందిలా, -

యది మాం దుఃఖితామేవం, వనం సీతు నచేచ్ఛసి ।

విషమగ్నిం జలం వాహమాస్థాస్యే మృత్యుకారణాత్ " అంటుంది

(అయోధ్యకాండ - 29 సర్గ - 21 శ్లో॥)

మీరు గనుక నన్ను వెంట తీసుకువెళ్లకపోతే నేను విషమును మ్రింగి గాని, అగ్నిలో దూకిగాని, జలములో మునిగిగాని, ప్రాణాలు విడుస్తాను కాని నీవు లేకుండ వుండలేనంది. పోతే ఇద్దరూ పోవటం, వుంటే ఇద్దరూ వుండటం అన్న ధీమా ఆమెది. భర్తతో అడవిలో సంచరించటం అంతఃపుర భోగాల కన్న మిన్నయన్న ప్రగాఢ విశ్వాసమామెది. ఎలాటి మాటలంటే పురుషునికి పౌరుషపరుస్తుందో ఆ మాటలతో చురక వెయ్యటానికి కూడ సందేహించలేదామె

*కిం త్వామన్యత వైదేహిః పితామే మిథిలాధిపః ।*

*రామ జామాతరం ప్రాప్య స్త్రియం పురుష విగ్రహమ్ ॥* అంటూ

మిథిలాధిపతియైన మా తండ్రి జనకుడు నీవు పురుషరూపంలో వున్న స్త్రీ వని తెలియక నన్ను నీ కిచ్చి వివాహం చేశాడు. అసలు నీలో మగతనం పౌరుషం వుందా అంటుంది. పైగా -

"*అనృత బత లోకోయం, అజ్ఞానాద్యద్ధివక్ష్యతి*" ఈ లోకం అజ్ఞానంతో నీవు మహావీరుడవని, ధర్మ స్వరూపుడవని కీర్తిస్తోంది. అయ్యో ఎంత అబద్ధం అని వాపోతుంది. అయితే ఈ మాటలు రాముని మీద కోపంతో అన్నవి కావు - రాముని వెంట నడవాలనే పంతంతో అన్నవి మాత్రమే!

ఈనాడెంత మంది స్త్రీల కలాటి ఆత్మస్థైర్యముంది? భర్త అధర్మవర్తనుడౌతున్నాడేమోనని సందేహం వచ్చినపుడు కూడ వారించింది. అరణ్యకాండలో ధనుర్ధారియైన రామునికి హితవు చెప్తున్న సందర్భములోని శ్లోకమిది -

త్రీణ్యేవ వ్యసనాన్యత్ర కామజాని భవన్త్యుత

మిథ్యావాక్యం పరమకం తస్మాద్గురుతరావుభౌ

పరదారాభిగమనం వినావైరం చ రౌద్ర తా ॥

స్వేచ్ఛా సంచారం వల్ల మూడు వ్యసనాలేర్పడుతాయి. అందులో మొదటిది అబద్ధమాడటం, రెండవది పరస్త్రీని కోరటం. మూడవది వైరం లేకుండా క్రోధం. మీరుసత్యవాక్పాలకులు ఏకపత్నీవ్రతులు కనుక మొదటి రెండు దోషాలు మీకంటవు. ఇక మూడోది మీకు తటస్థించింది. జటావల్కలములు ధరించి తిరుగుతున్న మీకు కోదండమెందుకు? రాజుల దగ్గర వున్న ధనువు, అగ్నికి దగ్గరవున్న సమిథలు వారి వారి తేజస్సును పెంచుతాయి. అవి చేతుల్లో వుంటే క్షాత్రతేజం మిమ్ము వరిస్తుంది. కనుక విసర్జించమంటుంది. అంతే కాదు.

స్నేహాచ్చ బహుమానాచ్చ స్మారయే నతు శిక్షయే, అంటుంది. మీయందలి గౌరవం వల్ల స్నేహాభిమానాల వల్ల మీకీ విషయం గుర్తు చేస్తున్నాను. మీకు బోధిస్తున్నాననుకోవద్దు అంటుందనునయంగా. *

# శ్రీ రుద్రమ్

- డా॥ యమ్ వి ఆర్ శర్మ

నమో భవస్య హేత్యై జగతాం పతయే నమః

భవస్య = సంసారం యొక్క, హేత్యై=హింసా రూపుని కొరకు (పూర్వ జన్మలోనూ, ఈ జన్మలోనూ చేసిన పాపముల ఫలముగా రుద్రుడు సంసార రూప హింసను వొసగుచున్నాడు.) జగతాం పతయే =స్థావర జంగమాది సమస్త లోకములకు స్వామియైన రుద్రునకు నమస్కారము.

రుద్రుడు ప్రాణుల కర్మానుసారముగా సంసార రూప దుఃఖాన్ని ప్రసాదిస్తున్నాడు. జగత్తును పాలించు వాడుగా ఆ దుఃఖితులను రక్షిస్తున్నాడు కూడానూ. స్వామి యొక్క రూప ద్వయము యీ మంత్రమున ప్రతిపాదింప బడినది.

మరియొక అర్థము ; భవస్య = సంసార రూప వృక్షమునకు, హేత్యై = ఛేదించు గొడ్డలి వంటి ఆయుధ రూపుడైన రుద్రునకు నమస్కారము

నమో రుద్రాయాఽఽత తావినే క్షేత్రాణాం పతయే నమః

ఆ తతావినే = ఎక్కు పెట్టబడిన ధనుస్సుచే భక్తులను రక్షించునట్టి, క్షేత్రాణాం పతయే= శరీరముల కన్నిటికీ స్వామియైన, రుద్రాయ నమః=రుద్రునికి నమస్కారము

"*ఇదం శరీరం కౌంతేయ క్షేత్రమిత్యభిధీయతే*' అను గీతా వాక్యానుసారము క్షేత్రమనగా శరీరమే. ఒక దేశపు రాజు ఆ దేశంలోని ప్రజలందరినీ కష్టాల నుండి రక్షిస్తాడు. సర్వ శరీరాధిపతి అయిన శివుడు అన్ని ప్రాణులనూ రక్షిస్తాడు. పరమేశ్వరుని కన్న గొప్ప రక్షకులు వుండరు కదా!

*ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి ।*
*భ్రామయన్సర్వ భూతాని యంత్రా రూఢాని మాయయా ॥*

సంసార యంత్రము నెక్కిన ప్రాణులనన్నిటినీ తన మాయతో తిప్పుతూ పరమాత్మ అన్ని భూతముల హృదయాలలోనూ వున్నాడు. సర్వాంతర్యామి యగు ఆ పరమాత్మ కాశీ మొదలైన క్షేత్రములలో మరణించు వారికి తారక బ్రహ్మ తత్త్వ ఉపదేశమూలకముగా

రక్షించునని యర్థము. ''జన్తోఃమ్రియమాణస్య రుద్రసాళీరకం బ్రహ్మ వ్యాచష్టే, యేనాసా వమృతీ భూత్వా మోక్షీ భవతి'' అని శ్రుతి.

నమస్సూతాయా హన్త్యా యవనానాం పతయే నమః

1. సూతాయ = జగత్తును రథమును నడుపు వాడగు రుద్రునకు, భ్రామయన్ సర్వ భూతాని యంత్రా రూఢాని మాయయా,

2. సూతాయ= యజ్ఞం కోసము ఉపయోగించు సోమలతా స్వరూపుడైన రుద్రునకు.

3. సూతాయ = పురాణ ప్రవచక రూపమున నున్న రుద్రునకు లేదా యుగాదిలో పురాణములను సృజించిన రుద్రునకు

1. అహన్త్యాయ = అంతయు తానేయైన పరమాత్మకు

2. అహన్త్యాయ = అవధ్యుడైన పరమాత్మకు, వనానాం పతయే = అడవులు మొదలైన ఏకాంత ప్రదేశముల కధిపతియైన రుద్రునకు నమస్కారము. జగత్తును రుద్రుడు నియమిస్తూ, పాలిస్తూ వున్నప్పటికీ ఆ జగత్తుకు సంబంధించిన షడ్భావ వికారములకు లోబడకుండా ఉండుననువిషయము అహన్త్యాయ పదముచే సూచ్యము.

షడ్భావ వికారములు : ఇవి దేహమునకు కలుగు మార్పులు

1. అస్తి = వుండుట 2. జాయతే = పుట్టుట 3. వర్ధతే = పెరుగుట 4. విపరిణమతి = వృద్ధాప్యం 5. అపక్షీయతి = క్షీణించుట 6. మ్రియతే = మరణించుట

నమో రోహితాయ స్థపతయే వృక్షాణాం పతయే నమః

రోహితాయ = 'రో' అనగా వాచకమగు శబ్దమున, 'హితాయ' అనగా వుంచ బడిన వాడు - వాచక శబ్దమున వాచ్యరూపముగా నున్న రుద్రునకు, స్థపతయే =సర్వత్ర స్థాతాచ, సర్వత్ర పాతాచ = అంతటా వుండి అన్నిటినీ రక్షించు వాడగు రుద్రునకు, వృక్షాణాం పతయే = చెట్లను పాలించు నట్టి రుద్రునకు - నమస్కారము



# గీతా జయంతి ఇలా జరుపుకొందాం!

- శ్రీమతి పి. సరళ.

మార్గశిర శుద్ధ ఏకాదశి నాడు గీతా జయంతి జరుపుకోవడం మన పరంపరలో ఒకసంప్రదాయం. కురుక్షేత్రంలో కౌరవ పాండవులుయుద్ధానికి మోహరించి ఉన్నసందర్భంలో అర్జునుడు విషాద యోగంలో పడ్డాడు. అపుడు శ్రీకృష్ణ పరమాత్మ గీత బోధించి ఈ నరలోకం గీతనే దిద్దారు. ఇందులో కర్మ, జ్ఞాన, భక్తి యోగాలు ప్రధానంగా ఉన్నాయి. తన ధర్మాన్ని నిర్వహించడంలో అర్జునుణ్ణి గీత ప్రేరేపించింది. ఎవరి ధర్మ నిర్వహణకైనా గాని గీత సమాధానమిస్తుంది. అనుష్ఠాన వేదాంతమే గీత బోధించేది. సర్వోపనిషత్తుల సారం భగవద్గీత. ఇది హిందువుల పవిత్ర గ్రంథంగా చెప్పబడుతున్నా నిజానికిది మానవ జాతికే నిత్య పారాయణ గ్రంథంలాంటిది. గీత పుట్టిన రోజు గీతా జయంతి జరుపుకొంటున్నాం. ఈ సందర్భంగా ఈ జయంతి ఎలా జరుపుకోవాలో ఆలోచిద్దాం.

1. ఒక ఎత్తైన స్థలంలో శ్రీ భగవద్గీతా గ్రంథాన్ని అమర్చి పసుపు కుంకుమాక్షితలతో పూజించాలి.
2. వ్యక్తిగతంగా గానీ, సామూహికంగా గాని 18 అధ్యాయాలు పారాయణం చేయాలి.
3. గీతా తత్త్వం తెలిసిన వారి చేత ఉపన్యాసాలిప్పించాలి.
4. బాల బాలికలకు మహిళలకు యువకులకు, పెద్దలకు వేర్వేరుగా గీతా పఠన పోటీలు ఏర్పాటు చేసి ఆరోజు సాయంకాలం సభ నిర్వహించి ప్రోత్సాహక బహుమతులివ్వాలి.
5. గీతను ఆధారంగా చేసుకొని తయారుచేసిన హరికథలు బుర్రకథలు పురాణ ప్రవచనం తదితర కాలక్షేపాలు కొనసాగించాలి.
6. ఉదారులైన వదాన్యులు గీతా గ్రంథాలను కొని వితరణ చేయాలి.
7. గీతార్థ సారాన్ని కరపత్రాల రూపంలో పుస్తికల (Booklets) రూపంలో ప్రచురించి పంచిపెట్టాలి.
8. ఉత్సవ మంటపంలోగాని, ఆలయంలో గాని గీతలోని వివిధార్థాలను తెలిపే చిత్ర పటాలనలంకరించాలి. వాటితో పాటు వేద వ్యాసమహర్షి, వాల్మీకి, ఆదిశంకర రామానుజ, మధ్వాచార్యాది మహర్షుల చిత్రపటాలను అలంకరించవచ్చు.
9. ఒక బండిలో ఎత్తైన పీట వేసి ఆ పీట మీద కాషాయ వస్త్రంలో భగవద్గీతను పెట్టి

తాామున్న వీథిలో కాని, గ్రామంలోకాని మేళతాళాలతో ఊరేగింపు తీయాలి.

10. ఆరోజునుండి తాము భగవద్గీతలో ఒక అధ్యాయాన్ని గాని కొంత భాగాన్ని కాని అధ్యయనం చేస్తామని సంకల్పించాలి.

11. గీతార్థసారంతో కూడుకున్న కీర్తనలను భజన సంఘాల్లో సామూహికంగా పాడుకోవాలి.

12. బాల బాలికలచేత కృష్ణార్జునుల వేషాలు వేయించి గీతా బోధకు సంబంధించిన నాటికలను ప్రదర్శించాలి.

13. ఈ ఏకాదశి నాడు జయంతి నిర్వహణ ఏకారణంతో నైనా సాధ్యం కాకపోయినట్లయితే మార్గశిర బహుళ ఏకాదశి వరకు పై కార్యక్రమాలు ఏవైనా నిర్వహించుకొనేట్లు యోజన చేసుకోవచ్చు.

ఈవిధంగా లేదా తమస్థానిక వనరుల మేరకు మరేవిధంగానైనా ఈ పండుగ జరుపుకోవచ్చును.ఎందుకంటే అర్జునునిలోని విషాదాన్ని దూరం చేసి మహత్తర శక్తిని ప్రసాదించిన అద్భుత పవిత్ర గ్రంథం భగవద్గీత. నీ ధర్మాన్ని నీవు రక్షించుకోడానికి నీలో శక్తిని నింపిన అనుష్ఠాన వేదాంత విజ్ఞాన భాండాగారం భగవద్గీత. వ్యక్తులు జరుపుకొనే జయంతులు వారికీ, వారి కుటుంబాలకూ సంతోషాన్నిస్తాయి. కాని గీతా జయంతి జాతికి శక్తిని, భక్తిని దేశం మీద అనురక్తిని, బంధ విముక్తిని ప్రసాదిస్తుంది. అందుకే అందరం గీతా జయంతి జరుపుకొందాం.

❄




## 3 వేల గ్రంథాల రచయిత

పండిత శ్రీరామశర్మ ఆచార్య 3200 గ్రంథాలు రచించారు. ఇవన్నీ ఆధ్యాత్మిక వైజ్ఞానిక గ్రంథాలు. ఆయన ఉత్తరప్రదేశ్‌లోని ఆగ్రా జిల్లా ఆవల్‌ఖేడ గ్రామంలో 1911లో మదనమోహనమాలవ్యా చేత గాయత్రీ మంత్రదీక్ష యజ్ఞోపవీత ధారణ చేయించుకొన్నారు. వారు స్థాపించిన అఖండ జ్యోతి ఆధ్యాత్మిక మాసపత్రికనెలకు పదిలక్షల కాపీలు అమ్ముడవుతున్నది. గాయత్రీ మంత్ర ప్రాశస్త్యాన్ని అపూర్వ వై...క దృష్టితో ప్రచారం చేశారు. 1990 జూన్ 2వ తేదీన వారు గాయత్రీ పరదేవతలో లీనమైపోయారు.




## అంతఃకరణమే ప్రమాణం

వాదోపవాదాల జంజాటంలో ఇరుక్కుపోవలసిన అవసరం లేదు. మీ అంతఃకరణాన్ని ప్రమాణంగా తీసుకొని పయనించండి. అదే ధర్మం. దాని నుండే తపస్సుకు కావలసిన ప్రేరణ లభిస్తుంది. ధర్మమార్గం గోచరిస్తుంది.

- పండిత దీనదయాళ్ ఉపాధ్యాయ.

# తొలి కరసేవకుడు భక్త రామదాసు

-డా॥ దాశరథుల బాలయ్య

నిజాం నిరంకుశ పాలనలో హిందూ సాంస్కృతిక, ఆధ్యాత్మిక, సామాజిక జీవనరంగాలకు గ్రహణం పట్టిన కాలమది. జాతి జీవనాడులైన భారత, భాగవత రామాయణాది గాథలను కళారూపాలలో సైతం ప్రదర్శించుకోలేని గడ్డు రోజులవి. స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు కోల్పోయి ప్రజా బాహుళ్యం దిక్కుతోచని స్థితిలో అలమటిస్తున్న చీకటి వేళలో ఆధ్యాత్మిక కాంతిపుంజమై వెలుగొంది, రాచరికపు దురాగతాలకు ఎదురొడ్డి నిలిచిన ధీరుడు భక్తరామదాసు. ప్రజా హృదయాలలో రగులుకొంటున్న జాతీయ విప్లవ జ్వాలలకు ప్రతీకగా నిలిచి ప్రజాధనం ప్రజాభిప్రాయ సాధనకే వినియోగించాలని భావించిన మహనీయుడు భద్రాచల రామదాసు. ప్రభుత్వ ఆదేశాలను సైతం ధిక్కరించి, స్వీయ జాతీయతా పతాకాన్ని రామాలయ నిర్మాణ కార్యంలో ఎగురవేసిన తొలి కరసేవకుడాయన.

భక్త రామదాసుగా పేరుగాంచిన కంచెర్ల గోపన్న ఖమ్మం జిల్లా నేలకొండపల్లి నివాసి. క్రీ.శ. 1620-1687 మధ్యకాలంలో జీవించిన భక్తరామదాసు ఆంధ్రదేశంలోనే గాక. భారతదేశమంతటా ప్రసిద్ధి గాంచిన పరమభక్తాగ్రేసరుడు. వీరి తల్లిదండ్రులు కామాంబలింగన్న మంత్రులు. గోల్కొండ నవాబుల కాలంలో అక్కన్న మాదన్నల ప్రోత్సాహంతో భద్రాచలం పరగణాకు తహసీల్దారై ప్రభుత్వ ఖజానాతో రామాలయం నిర్మించారు. పన్నెండేళ్ళు కారాగార మనుభవించారు. శ్రీరామచంద్రునిపై అనేక కీర్తనలు రచించారు. గానం చేశారు. రామభక్తి ప్రవంతిలో తేలియాడారు. ఆంధ్రదేశంలో శ్రీరాముని గుడిలేని గ్రామం కానీ, రామదాసు రచించిన భక్తి కీర్తనలు గోష్ఠులలో గానం చేయని రామాలయం కానీ లేదనడం అతిశయోక్తి కాదు.

దాశరథి శతకం రచించిన కంచెర్ల గోపన్నే. వందలాది భక్తి కీర్తనల ద్వారా రామభక్తి ప్రచారకుడై వాగ్గేయకారుడనే కీర్తి గడించారు.

నిత్యదేవతార్చన, సంకీర్తన. గోష్ఠులు - సాధు సంతర్పణ, ఆలయంలో పురాణ శ్రవణం - ఇత్యాది కుటుంబ సాంప్రదాయిక వాతావరణం ఇంటిలో పెరిగిన గోపన్నకు భక్తి తత్పరత బాల్యంలోనే అలవడింది. బాల్యంలో ఆలయాన రామకథ, పురాణ శ్రవణం ద్వారా విని ఉత్తేజితుడై 'ఆశపుట్టెనే శ్రీరాములతో ఆహానే పుట్టనైతి' అని గానం చేశాడు. ఆనాడే నేను పుట్టి శ్రీరాముల సేవ నే చేయలేకపోతినే అనే ఆర్తిని వెలిబుచ్చుతూ గానం చేసిన ఈ కీర్తన బాల్యంలోనే గోపన్నకు గల భక్తిభావనకు తార్కాణం.

భద్రాచల రామదాసు - పోతన్న, వేమన్నల వలె సహజకవిగా, వాగ్గేయకారుడుగా స్థిర

కీర్తి వహించడమే గాక భద్రాద్రిలో ఆయన కైంకర్యం చేశారు. ఆయన నెలకొల్పిన శ్రీరాముని కోవెల ఆదర్శ మానవుడైన పురుషోత్తముని నిలయం. మానవతాదర్శాలను సజ్జనతాది దైవీగుణాలను ప్రోది చేసుకొని దుర్జనత్వాది రాక్షస గుణాలపై చిరస్థాయి విజయం సాధించారు. గోల్కొండ సామ్రాజ్య సేనానులు దేవాలయాలను కూలగొట్టి విగ్రహ భంగాలు చేస్తున్న రోజులలో సామ్రాజ్యపు నడిబొడ్డున రామాలయం నిర్మించిన కరసేవక శ్రేష్ఠుడు రామదాసు. తొలికరసేవకడు భక్తరామదాసు.

ఆలయాన్ని నిర్మించడమే కాకుండా శాశ్వతంగా ఆలయ నిర్వహణకు ఎలాంటి ఆటంకాలు కలుగని రీతిలో ఏర్పాటు చేశారు. తాను ఏర్పరచిన నియమం చిరకాలం పాటింపబడే విధంగా రామలక్ష్మణ స్తంభాల పేరుతో శాసనాలు వేయించారు.

"శ్రీరామనామం మరువాం మరువాం
సిద్ధము యమునికి వెరువాం వెరువాం"

అని ఆనాడే ఎలుగెత్తి చాటిన రామదాసు కీర్తనల స్ఫూర్తి ఈనాటి తరానికి తారకమంత్రమై రామరాజ్య స్థాపనకు బాటలు వేయాలి. ఆ ఆదర్శ రామరాజ్య నిర్మాణంలో మనమందరం కరసేవకులం కావాలి.

జై శ్రీరాం.



## గోడలు కూల్చేస్తే.....



పరమ పూజనీయ గురూజీ, పండిత జవహర్‌లాల్ నెహ్రూ ఒక సందర్భంలో కలుసుకున్నారు. వారి మధ్య సంభాషణ ఈ విధంగా సాగింది.

నెహ్రూజీ :- ఎల్లప్పుడూ హిందూ, హిందూ అంటుంటారెందుకు? దీని వల్ల నాలుగు గోడల మధ్య కూరుకుపోయి, ప్రపంచంలోని నలుదిశల నుండి వచ్చే మంచి గాలిని మీరు నిరోధిస్తున్నారు. మనకీ విశాల విశ్వానికీ మధ్య అడ్డుగోడలుండడానికి వీలులేదు. ఈ అడ్డంకులన్నింటినీ కూలగొట్టాలి.

గురూజీ:- నలు దిశల నుండి శుభ్రమైన గాలి మన కందాలన్న విషయంలో నేను మీతో పూర్తిగా ఏకీభవిస్తున్నాను. ప్రపంచంలో వివిధ దేశాలలో అమల్లో ఉన్న అన్ని సిద్ధాంతాలూ, మనకు తెలియాలి, మంచి చెడులను మనం నిర్ణయించుకోవాలి. ప్రతి మంచి విషయాన్ని మనం స్వీకరించాలి. దీని కోసమని గోడలే కూల్చేస్తే ఇంటికప్పు నేరుగా నెత్తిమీదే వాలుతుంది. అలాకాదు. కిటికీలు, గుమ్మాలు తెరచి అట్టే బెట్టుకోవాలి. మన యిల్లు భద్రంగా కాపాడుకోవాలి. విశాల హృదయమనేది సముచితమైన హద్దులు దాటితే మన జాతి అస్తిత్వమే అంతరించిపోతుంది. మీరనే సంకుచిత భావమే మన జాతిని పునరుద్ధరించగలదు. ప్రపంచంలోని మంచినంతనూ స్వీకరించగలదు కూడా. ఇదీ నా విశ్వాసం.

నెహ్రూజీ:- సరే! ఏ దృఢ ప్రయత్నం చేయాలన్నా ఇటువంటి విశ్వాసం అత్యవసరం.

గురూజీ:- ఈ మాత్రమైనా అంగీకరించినందుకు కృతజ్ఞతలు.

చిన్నకథ-పెద్దసందేశం

# ఎవరిత్రాడు వాడే అల్లుకొంటున్నాడు

-డా॥ కసిరెడ్డి

ఏదో దారం తనను బంధించి తీసుకొని పోతున్నది. దాన్ని పట్టి త్రెంపి వేద్దామని విఫల ప్రయత్నం చేస్తున్నాడు విదూషకుడు. కాని అది సాధ్యం కావడం లేదు.

తానీ లోకంలో ఎంతమందినో నవ్వించాడూ, తానూ నవ్వాడు. కష్టాల కడగళ్లూ ఉన్నాయి - కన్నీరు ఉంది తనకు. అయినా జీవితంలో ఆనందాన్ని పంచుకోడానికే ప్రయత్నించాడు. ఈ లాగికొని పోతున్న స్థితి కూడా ఆనందంగానే ఉన్నది తనలాగే ఎందరో ఈ త్రాళ్లకు కట్టువడి ఈ సుందర యమపురికి వస్తుంటారని అర్థమయ్యింది.

ఎదురుగా యమధర్మరాజున్నాడు. విదూషకుడు అతని ముందాగి పోయాడు. "ఏమయ్యా యమధర్మరాజా! ఇంతమందిని త్రాళ్లతో లాగుకొని వస్తున్నావు. ఇన్ని త్రాళ్లెక్కడివి! మీ యమపురిలో ఇన్ని త్రాళ్లు ఎవరు అల్లుతున్నారు. అసలు మీరు అంతపెద్ద త్రాళ్ల ఫ్యాక్టరి ఎక్కడ పెట్టుకొన్నారు. విష్ణుమూర్తి అనుమతి తీసుకొనే త్రాళ్ల ఫ్యాక్టరీ పెట్టుకొన్నారా! రోజుకు యమపురి నుండి జీవపురి వరకు అంతంత పొడుగు త్రాళ్లు ఎన్ని తయారు చేస్తున్నారు. ఉత్పత్తి సక్రమమా! అక్రమమా! ఈ త్రాళ్ళతో అందరినీ న్యాయంగానే బంధిస్తున్నారా! లేకపోతే మీకు ఎవరిమీద కోపముంటే వాళ్ళను లాక్కొని వస్తున్నారా!" అని ప్రశ్నార్థక ముఖం పెట్టాడు.

"అంతా సక్రమంగానే జరుగుతున్నది. అయితే మేం త్రాళ్ల ఫ్యాక్టరీ లాంటిదేం నెలకొల్పలేదు. ఎందుకంటే ఈ జీవకోటి అంతా తమ జీవితకాలంలో అల్లుకొన్న -పేనుకొన్న వాళ్ల త్రాళ్లతోనే మేం లాక్కొని వస్తున్నాం! అంతే" అన్నాడు ధీరగంభీరంగా యమధర్మరాజు. పైగా నేను ధర్మాన్ని నియమబద్ధంగా నడిపించడానికి విష్ణుమూర్తి చేత నియమింపబడ్డ రాజును తెలిసిందా అన్నాడు కనుబొమలెగరవేస్తూ.

వెంటనే విదూషకుడు "సుతంతుః, తంతువర్ధనః" అన్నాడు. 'అవేమిటి!' అని ముఖం చిట్లించాడు యమధర్మరాజు.

'విష్ణుమూర్తి సహస్రనామాలలో ఈ రెండూ ఉన్నాయి' అన్నాడు విదూషకుడు. 'మీచేత అల్లించిన తంతువులను (దారాలను) నా చేతికిచ్చాడు' అంటూ వెళ్లిపోయాడు యమధర్మరాజు. 'అయితే ఈ త్రాడు నేనల్లుకొన్నదేనా' అనుకొంటూ ఆయన్ని అనుసరించాడు విదూషకుడు.

పరమాత్మ సుతంతువు; అందమైన దారాలతో ఈ సృష్టిని తీర్చిదిద్దాడు. మన త్రాళ్ళు మన చేతికే ఇచ్చాడు. మనత్రాళ్లతోటే మనల్ని భౌతికంగా ఎంతమంది విదేశీయులు బంధించారో భారతీయులంతా ఆలోచించుకోండి! చివరికి వారు భారత మాతనూ బంధించారు కదా! ఎంతోమంది బలిదానంతో కాని, మన త్రాళ్లతో మనల్ని బంధించిన ఆసురీశక్తులను వెళ్లగొట్టలేకపోయాం. వెళ్లగొట్టినా చూరును పట్టుకొని, వ్రేలాడుతున్న గబ్బిలాల్లాగా ఇవి ఇంకా వ్రేలాడుతూనే ఉన్నాయి గదా! స్వతంత్ర భారత స్వర్ణోత్సవాలు జరుపుకొంటున్నాం; ఇలాగే జరుపుకొందామా!

# ధర్మ సందేహాలు

**(ఈ నెల నుండీ ఈ శీర్షిక ప్రారంభిస్తున్నాం. మీరు ప్రశ్నలడగండి? ప్రముఖులనడిగి సమాధానాలు సేకరించి ప్రచురిస్తాం.)**

ప్రశ్నలు : దీపా మెహతా ఫైర్ (అగ్ని) సినిమా తీసింది. ఈ చిత్రంలో రాధ పాత్ర పోషించిన షబనా అజ్మీ హిందుతత్వాన్ని అవహేళన చేస్తూ ఎన్నో ప్రశ్నలడుగుతుంది. వాటిలో ఒకటి, రెండు..... *(1) జీవితోద్దేశ్యం కోరికను నశింపజేయడమే అయితే అసలు జీవించడమనేదెందుకు? (2) నేను అనేకసార్లు అనుకొంటుంటాను? ఏమనంటే! హిందూ వేదాంతం చాలా వరకూ మనందరినీ నపుంసకులుగా తయారు చేయడానికేనని.....''* ఈ సినిమా ముఖ్యంగా యువత చూచి ఉంటారు. వారిలోని ప్రశ్నలే ఇవిగా భావించండి.

- శ్రీరాజశేఖర్, నల్లకుంట, భాగ్యనగర్.

సమాధానం:- సమాధానం చదవడానికి ముందు ప్రశ్నలు మరోసారి చదవండి. వీరి బండారం బయట పడుతుంది. వీరి ఉద్దేశ్యం కోరికల్ని తగ్గించుకోకుండా రోజురోజుకూ -క్షణక్షణానికి వాటిని పెంచుకోవాలనే కదండి! అవి తీరక ఒక వంక బాధపడుతూ తీర్చుకొనేందుకు పరమ చండాలపు దారులను తొక్కితే ఏమవుతుందని యువతను రెచ్చగొట్టడమే కదా! భారతీయ యువత పాడైపోయి సంఘాన్నీ - దేశాన్ని పాడు చేయాలనే వీరి ఉద్దేశ్యం. దురుద్దేశ్యపూర్వకంగా ఇలాంటి పిచ్చి ప్రశ్నలు లేవనెత్తే వీరు అరబ్బు దేశాల్లో అలా తీర్చుకొనే వారి అంగాల్ని ఖండించడాన్ని, రాళ్లతో కొట్టి చంపడాన్ని కూడా సమర్థిస్తారా! కోరికను చంపుకోడం కాదు నిగ్రహించుకోమంటుంది హిందూ వేదాంతం. నాశనానికి నిగ్రహానికి తేడా తెలియకుండా అడిగిన అజ్ఞానుల గురించి ఇక ఏం చెప్పేది! సినిమాల్లో ఇలాంటి పిచ్చి ప్రశ్నలు లేవనెత్తే ఉద్దేశ్యం మనధర్మగ్రంథాల్ని, ధర్మాచార్యుల్ని అవమానపరచాలనేదే తప్ప ఇంకొకటేం లేదు. అడ్డగోలుగా కోరికలు తీర్చుకొని నిర్వీర్యులై పోయిన యువకుల కారణంగానే నేను చివరి యుద్ధంలో బ్రిటన్ సేనాధిపతి నెల్సన్ చేతుల్లో ఓడిపోయానంటాడు నెపోలియన్. కోరికలు తీర్చుకోవడమే జీవితమనే దుర్మార్గ ప్రచారానికి సిగ్గులేకుండా సినిమా మాధ్యాన్ని ఉపయోగించుకొనే వారు కళాద్రోహులవుతారు తప్ప కళాకారులు కారు.

ఇక రెండో అంశం హిందూవేదాంతం మనల్ని నపుంసకులుగా చేస్తుందనేది. ''స్వయమేవ మృగేంద్రతా' నినాదం హిందూవేదాంతం ఇచ్చిందే. ''బలముపాస్వ'' అంటుంది హిందూ వేదాంతం. విషాదం నుండి అర్జునుడు తేరుకొని ధర్మయుద్ధం చేసింది ఈ వేదాంతం వల్లనే. రాముడు సీతనెత్తుకువెళ్లిన రావణున్ని సంహరించింది ఈ యోగవాసిష్ఠ వేదాంతం వినే. అంతెందుకు మహర్షి దయానందుడు, తిలక్, వివేకానందుడు, వీరసావర్కర్ ఈ వేదాంతంతోనే వీరులను తయారు చేశారు. హిందూవేదాంతమే ప్రధానంగా అధ్యయనం చేసిన అల్లూరి సీతారామరాజు, నేతాజీ, అరవిందులు - విప్లవ వీర పథంలో పయనించారన్న సంగతి కూడా తెలియకుండా దట్టమైన అజ్ఞానంతో అడిగిన రెచ్చగొట్టే ప్రశ్న ఇది. ఈ విధంగా ఇలాంటి పిచ్చి ప్రశ్న ఒక పాత్రచేత అడిగించిన నిర్మాతకు, దర్శకునికి, రచయితకు నిస్సిగ్గుగా అడిగిన పాత్రకు బుద్ధి చెప్పకపోవడమే ఇప్పుడు నిజంగా నపుంసకత్వమనిపిస్తుంది. [సమాధానం : జి.ఎన్.రావు)



# దీపంజ్యోతి పరబ్రహ్మ

- డా॥ పరవస్తు కమల

దీపం వెలిగించగానే మనం నమస్కరిస్తాం. ఇది ఆచారమయింది. కొందరు ఈక్రింది శ్లోకం చదువుతూ దండం పెడుతూ దీపం వెలిగిస్తారు. (ఇపుడైతే లైటు వేస్తారు. దండం పెడతారు)

దీపంజ్యోతి పరబ్రహ్మం- దీపం సర్వతమోహరం।
దీపేన సాధ్యతే సర్వం - సంధ్యా దీప నమోస్తుతే॥

మరి ఈ ఆచారం వెనుక ఉన్న అంతరార్థాలు తెలుసుకొందాం. దండంపెట్టడం తంతు అయితే, ఆ తంతుకున్న తత్త్వమేమిటో తెలుసుకొని పెట్టడం మరీ అర్థవంతంగా ఉంటుంది కదా!

'దీపంజ్యోతి పరబ్రహ్మ', దీపం జ్యోతిస్వరూపం, పర బ్రహ్మ స్వరూపం, చీకటిని నశింప జేసి వెలుగు నిచ్చేది. సమస్త పాపాలను హరింప జేసేది. ప్రకాశింప జేసేది. కనుకనే అది దీపమయింది. కేవలం ప్రకాశింప జేసేది మాత్రమే గాదు, ఇంకో దీపాన్ని లేక వస్తువును కూడా వెలిగించే (రగిల్చే) తత్త్వం కూడా కల్గినది. దీపనము చేసేది కనుక దీపము. అంతేకాదు 'దీపకముగా' కుంకుమగా సమస్త శుభసంకేతాలకు, సంపదలకు నిలయమై ప్రకాశించేది కూడ. కేవలం వెలుగు నిచ్చేది చైతన్యాన్నిచ్చేది కాంతి రూపమైనది 'పరబ్రహ్మ' ఔతుందా! ఔను తప్పక అదే పరబ్రహ్మ మౌతున్నది. పరబ్రహ్మ ప్రతీకగా అదినిల్చి ఉన్నది.

**దీపం జ్యోతి:** మయూర శిఖ అనే అర్థం కూడ దీపానికున్నది. నెమలి పురి, నెమలికన్ను జ్ఞాన కాంతులకు నెమలిశిఖ సంకేతం. జ్ఞాన కాంతుల్ని వెలిగించేది కనుక జ్యోతి స్వరూపంగా పిలువబడుతున్నది. 'జ్యోతి' అంటే అగ్ని, సూర్యుడు, వెలుగు, నక్షత్రం, మెరపు, చైతన్యం, యాగము, స్వర్గము. ఇంకా దర్శక శక్తి అని అర్థాలున్నాయి. శక్తి స్వరూపమై వెలిగించే శక్తి కూడా కలది అగ్ని. ఇదే సృష్టి తత్వం. ప్రకాశాలతో చీకటిని హరింపజేసి, సమస్త లోకాలను వెలిగింప చేసేవాడు. అంతే కాదు పాపాలను కూడ నశింపజేసేవాడు. కనుక సూర్యుని 'తమఘ్నుం సర్వపాపఘ్నుం ప్రణతోఽస్మి దివాకరమ్ అని నమస్కరిస్తున్నాము. చీకట్లో మెరిసేది నక్షత్రం. అజ్ఞానంలో వెలుగు కాంతి జ్యోతి. జడత్వాన్ని పోగొట్టిచైతన్యత్వాన్ని కల్గించేది కనుక జ్యోతి. సమస్త యాగాల్లో అగ్ని రూపంగా

# మనిషి - కర్మనిష్ఠత

-చౌదూరి గోపాలరావు

ఖలునిన్ సజ్జనుగాగ, మూర్ఖజను సంఖ్యావంతునిక్‌గాగ, దాయలసన్మిత్యులుగా, నగోచరము బ్రత్యక్షంబుగా, బ్రాణహృత్క్ష్వేలనంబైన మహోవిషం బమృతంబుగా జేయు, సత్కర్మము జ్వలనిషానిధి వైభజింపుము, వయస్యావాంఛితార్థాప్తికిక్. దుర్జనుడి సజ్జనుడిగా, మూర్ఖుని విద్వాంసునిగా, శత్రువును మిత్రునిగా, కనుపించనివి కనిపింపజేయునదిగా, విషమును అమృతంబుగా, జేయగలశక్తి మానవకర్మలకున్నది. వాటి ఆచరణచే కోరికలు తీమనని భర్తృహరి అంటాడు.

వేదభవనము, త్రికాండములపై ఆధారపడి ఉందంటారు, కాండమంటే స్తంభము. జ్ఞాన, భక్తి, కర్మలనే త్రికాండము లంటారు వేదవేత్తలు మన పూర్వులు కుర్వన్నేవేహకర్మాణి జిజీవిషేత్ శతగుమ్‌సమాః'' అనే వేదమంత్రాన్ని ఉదహరిస్తారు. మానవుడు బ్రతికినంతకాలం, కర్మలు చేస్తూనే ఉండాలని మంత్రార్థం భగవద్గీత కూడా కర్మలని వార్యమంటూంది. భారతీయులు ఈ కర్మ సిద్ధాంతాన్నివదిలి నిష్క్రియను నేర్పే పివృతికత వేదాంతాన్ని అనుసరించటంవల్ల బానిసలైపోయారని అరవిందుడంటాడు. కర్మలు ప్రవర్తించే విధంతెలియాలి.

మనం చేస్తున్న పనికి కారణమైన కోరికలు, ఆలోచనలు, నిండిన ఒక శక్తి వీటి వేనక ఉంటుంధి. ఆశక్తినే వాసన అంటారు. ఈ వాసనలు అంతర్గత ప్రవృత్తులవల్ల ఉద్భవిస్తాయి. వీటి చర్యలు బలీయంవైనవి. అయినా వాటిని మార్చుకొనే శక్తి మానవుడి కొక్కడికే ఉంది. మానవశక్తినుపయోగించి వాసనల త్రోసి రాజని చేసే కర్మలే నిష్కామకర్మలుగా గీత నిర్వచించింది. వాసనగత శక్తి అవుతే, నిష్కామ కర్మ భవిష్యత్ శక్తి అంటే మనిషి కర్మలో స్వతంత్రుడన్న మాట, ఫలితంలో మాత్రం పరాధీనుడు. ఉదాహరణంగా తినేస్వాతంత్ర్యం నాకుంది, ఎక్కువ తిన్నందువల్ల వచ్చే అజీర్ణబాధ నాచేతిలో లేదు.

కర్మలు అంటే చేస్తున్నపనులు అన్నికర్మలు వాటి వాటి ప్రభావం కలిగి ఉంటాయి. ఇది గమనించిన గీతాచార్యుడు యజ్ఞదాన, తపఃకర్మ, నత్యాజ్యం కార్యమేవతత్'' అంటాడు. వీటివల్ల మృత్యువును తరించి జ్ఞానముతో అమృతత్వము పొందవచ్చునంటొంది వేదం. ''అవిద్యయామృత్యుం తీర్త్వా, విద్యయా అమృతమశ్నుతే'' అవిద్య అంటే వేదవిహిత కర్మలు. జ్ఞానకర్మల సముచ్చయమే వైదిక విజ్ఞానము.

బ్రహ్మజ్ఞానం రెండురకాలు. శౌనకడను విద్యార్థి అంగిరసుడను గురువును సమీపించి ''కస్మిన్నుభగవో! విజ్ఞాతే సర్వమిదం, విజ్ఞాతం భవతి'', ఓ భగవాన్ ఏది తెలుసుకొంటే సర్వం తెలుస్తుంది అని ప్రశ్నిస్తే, బ్రహ్మజ్ఞానంవల్ల తెలుస్తుందంటాడు. అది రెండు విధాలంటాడు. ''ద్వేవిద్యే వేదితవ్యే, పరాచైవా, పరాచేతి, ఒకటి పరవిద్య రెండవది అపరవిద్య, అపరవిద్య లోకవిహితవైదిక కర్మలు. పర విద్య బ్రహ్మతత్వము. ఈ రెండింటిలో ఏదివిడిచినా అమృతత్వము సిద్ధించదన్నారు. ఈరెండు కలిసినడిచినప్పుడే జాతిక్రియావంతమౌతుందంటారు. వైదిక కాలంలో క్రియాశీలత కర్మనిష్ఠత, జ్ఞానవంతమైయుండేదని చరిత్ర చెబుతున్నది.

కర్మకాండను వదిలి, కేవలం వాచావేదాంతులంకాగానే మనిషిలో ఆశలు ప్రారంభమౌతాయి, అల్పమైన ఆశలసాధనకు ఈ విద్యలనే వినియోగించటం ప్రారంభిస్తాము. చరిత్రను గమనిస్తే మన దేశం రానురాను క్రియాశీలతను గోల్పోయి తన చుట్టూ ఉన్న సమాజదర్శనం చేయలేకపోతున్నది. తన కోసం వండుకోవడం పాపం అన్న గీతామాత పుట్టిన దేశంలో, పేదతనం, అజ్ఞానం,

# నిరంతర కార్యసాధనే పరిషత్ కార్యకర్త లక్షణం

పాశ్చాత్యీకరణ ప్రభావం వల్ల హిందూ గౌరవ చిహ్నాలను గురించి పట్టించుకోని వ్యక్తులను సరైన మార్గంలోకి మళ్లించే యత్నానికై విశ్వహిందూపరిషత్ కార్యకర్తలు కృషి చేయాలని పరిషత్ పశ్చిమాంధ్ర ప్రాంత కార్యాధ్యక్షులు డాక్టర్ ఎం.వి.ఆర్. శర్మ పిలుపు నిచ్చారు. కడప జిల్లా ఆళ్లగడ్డ సమీపంలో అహోబల నృసింహక్షేత్రంలో కాశిరెడ్డినాయన ఆశ్రమంలో నవంబర్ 16, 17 తేదీల్లో జరిగిన పశ్చిమాంధ్రప్రాంత సమావేశాల్లో ఆయన ఉద్ఘాటన ప్రసంగం చేశారు. పరీక్షల ముందు చదివే విద్యార్థుల్లా కాకుండా పరిషత్ కార్యకర్తలు నిరంతర కార్యశీలురు కావాలన్నారు. దేశంలో దేశభక్తి, దైవభక్తి. రా[illegible]క్తి. జాతిభక్తి చాలా కాలంగా ఉంది. వాటి మధ్య సరైన సమన్వయం సాధించడమే [illegible]మన్నారు. ఒకే నాణానికి రెండు వైపులా ఉండే బొమ్మా బొరుసుల్లాగా ప్రతిమనిషికీ వ్యక్తిగత శీలం, జాతీయ శీలం అవసరమన్నారు. జాతీయ శీలాన్ని పట్టించుకోకపోవడం వల్లనే అనేకనష్టాలు వచ్చాయన్నారు. ఘోరీ దండయాత్ర సందర్భంగా సోమనాథ దేవాలయానికి శివభక్తులే దారి చూపిన ఉదంతాన్ని డాక్టర్ శర్మ గుర్తు చేశారు. దేవాలయం విధ్వంసానికి గురవుతుందని తెలిసినప్పటికీ అసత్యమాడలేని శివభక్తులు అలా చేశారన్నారు. దేశంలో తమ పని మాత్రమే తాము చేసుకునేవాళ్లు చాలా మంది ఉన్నారన్నారు. నా ఉద్యోగం నేను చేసుకొంటున్నాను. భార్య పిల్లల్ని పోషించుకుంటున్నాను అన్న స్వార్థం హద్దులను దాటించి వారిని సమాజ కార్యంవైపు మళ్లించాల్సి ఉందన్నారు. వాళ్లను మన మార్గంలోకి ఎలా తేగలం? ఎలా శ్రమపడగలమని ప్రతి కార్యకర్త యోచించాలన్నారు. ప్రాంత ప్రధాన కార్యదర్శి మాన్యశ్రీ మంచన గుండేరావు ప్రసంగిస్తూ స్వాతంత్ర్య భారత స్వర్ణోత్సవాల సందర్భాన్ని పురస్కరించుకుని పరిషత్ కార్యకర్తలు సమాజాన్ని ప్రేరేపించవలసి ఉందన్నారు. దేశంలో ఏభై ఏళ్లుగా జరుగుతున్న పొరపాట్లు ఇక ముందు జరుగకుండా జాగృత మయ్యేలా సమాజాన్ని సమాయత్తం చేయాలన్నారు. సత్సంగయోజనపై దృష్టి కేంద్రీకరించి సంస్థాగత కార్యక్రమాలు విస్తరించాలన్నారు. ప్రాంతంలోని వివిధ జిల్లాల్లో సత్సంగాల సంఖ్య పెరుగుతున్నట్లు సమాచారమందుతోందన్నారు. నిర్ణీత లక్ష్యం సాధించే వరకూ సత్సంగాల సంఖ్యను ఇతోధికంగా పెంచాలన్నారు. గోరక్షా విభాగంలో చెప్పుకోదగినంత ప్రగతిని సాధించాల్సి ఉందన్నారు. పరిషత్ కార్యక్రమాలు విస్తరిస్తున్నందున అందుకు అనుగుణంగా పూర్ణావధికార్యకర్తలను, కొంత సమయమిచ్చే కార్యకర్తలను సేకరించుకోవలసి ఉందన్నారు. సమావేశ ప్రారంభానికి ముందు క్షేత్ర సంఘటనా కార్యదర్శి మాన్యశ్రీ కోటేశ్వరశర్మ జ్యోతి ప్రకాశనం చేయగా శ్రీమతి మంగళ ప్రార్థనా గీతాన్ని ఆలపించారు. ప్రాంత సంఘటనా కార్యదర్శి మాన్యశ్రీ ఎం. సుబ్రహ్మణ్యం, సహసంఘటనా కార్యదర్శి సత్యంజీ, సహప్రధాన కార్యదర్శి మాన్యశ్రీ మురళీధర్‌రావు, వివిధ జిల్లాల కార్యదర్శులు, సంఘటనా కార్యదర్శులు, ప్రాంత కార్యకారిణి సభ్యులు కార్యక్రమంలో పాల్గొన్నారు.

---

**సూక్తి: శీలం యొక్క రెండు అంశాలయిన వ్యక్తిగత శీలం, రాష్ట్రీయ శీలం జాతీయ వైభవానికి రెండు ఊపిరితిత్తుల వంటివి.**

# పనివేగం పెరగాలి

- శ్రీ కోటేశ్వర శర్మ

*(అహోబిల క్షేత్రంలో కాశిరెడ్డినాయన ఆశ్రమంలో నవంబర్ 16,17 తేదీల్లో జరిగినవి. విశ్వహిందూపరిషత్ పశ్చిమాంధ్ర ప్రాంత సమావేశాలకు ముఖ్యఅతిథిగా క్షేత్ర సంఘటనా కార్యదర్శి మాన్యశ్రీ కోటేశ్వరశర్మ హాజరయ్యారు. వారి ప్రధాన ప్రసంగంలోని ముఖ్యాంశాలు ప్రచురిస్తున్నాం.... **సంపాదకులు.**)*

యావత్ ప్రపంచం 21వ శతాబ్దంలోకి అడుగుపెట్టడానికి సిద్ధపడుతోంది. రానున్న మూడేళ్లు మనకు నిర్ణాయకమైన సంవత్సరాలుగా సంఘ పరివార్ భావిస్తోంది. దశాబ్దాల కృషి ఫలితంగా నిర్ణాయకమైన పాత్రను నిర్వహించే స్థితికి చేరుకున్నాం. మూడేళ్ల తర్వాత 2001లో ప్రవేశించేనాటికి సమాజంపై హిందు ఆధిపత్యం ఏర్పడాలి. అందుకు అన్ని క్షేత్రాల్లోనూ హిందూ సంఘటనా కార్యం విస్తరించాలి. ప్రస్తుతం మనకున్న శక్తిని నాలుగురెట్లు పెంచుకుంటేనే మనం లక్ష్యాన్ని చేరుకోగలుగుతాం. మూడు సంవత్సరాల్లో అన్ని ఆయామ్‌లలో, అన్ని విషయాల్లో నాలుగు రెట్లు పని ఎలా పెంచాలో యోజన చేయాలి. కార్యకర్తపైనే సంఘటనా కార్యం ఆధారపడి ఉంది. కార్యకర్తల సంఖ్యను పెంచుకోవడంతో పాటు, కార్యకర్తల కార్యకుశలతను పెంచుకోవడం కూడా ఈ సందర్భంగా అవసరం.

ఈశాన్య రాష్ట్రాల తర్వాత మతమార్పిడులు ఆంధ్రదేశంలోనే అధికంగా కొనసాగుతున్నాయి. మతమార్పిడులను సమర్థవంతంగా నిరోధించడానికి ధర్మప్రసార్ ఆయామ్‌ను పటిష్ఠం చేయాలి. గోరక్ష విషయంలో మూడేళ్ల తర్వాత ప్రత్యక్ష చర్యను ప్రకటించబోతున్నాం. ఎక్కడికక్కడ గోహంతకులను పట్టుకుని శిక్షించే విధంగా ప్రజలను సన్నద్ధం చేయాల్సి ఉంది. ఇందుకోసం భజరంగ్‌దళ్, దుర్గావాహిని ఆయామ్‌లను బలోపేతం చేయాలి. దేవాలయాలు, మతమందిరాలను రాజకీయ పార్టీలు, నాయకుల కబంధహస్తాల నుండి విముక్తం చేసుకోవాలి. ఇందుకోసం పటిష్ఠమైన దేవాదాయ, ధర్మాదాయ చట్టం ఏర్పాటుకు యత్నించవలసి ఉంది. ఆ దిశగా ధర్మప్రసార్ ఆయామ్‌ను పటిష్ఠం చేయాలి. రానున్న మూడేళ్ళలో యోజనాబద్ధమైన కృషితో పని వేగాన్ని పెంచితేనే ఇవన్నీ సాధ్యమవుతాయి.

## ఈ స్థితికి బాధ్యులెవరు?
## సమాజమా! మేలుకో !

దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించి ఏబై సంవత్సరాలు గడిచాయి. ఈ సుదీర్ఘ కాలఖండం ఎంతో విలువైంది. ఈ కాలంలో మనం సాధించిందేమిటి? సమాజం వికాసంవైపు,

వైపు పయనించిందా? అందుకు భిన్నంగా అన్ని వ్యవస్థలూ అధోముఖంగా పయనిస్తున్నాయా? అని ఆలోచించవలసిన తరుణం ఆసన్నమైంది. దేశానికి స్వాతంత్ర్యం లభించి ఏభై ఏళ్లు పూర్తి చేసుకున్నామని చెప్పుకున్నట్లుగా దేశం విభజించబడి కూడా ఏభై ఏళ్లు పూర్తయ్యాయని గుర్తుంచుకోవాలి. భారతదేశం అఖండమైంది, సాంస్కృతికంగా విస్తృత మైందనే భావాన్ని సమాజంలో పటిష్ఠం చేయలేకపోయాం. పైగా అనేక భూభాగాలపై పట్టుకోల్పోయాం. భూభాగాలను రక్షించుకునే దక్షత లేని ప్రభుత్వాలు దేశాన్ని పాలించడమే యిందుకు కారణం. బంగ్లాదేశ్ యుద్ధంలో కీలకమైన పాత్ర నిర్వహించామని ఘనంగా చెప్పుకుంటున్నాం. కానీ ఆ అదునును వినియోగించుకుని పాక్ ఆక్రమిత కాశ్మీర్‌ను విడుదల చేయలేకపోయాం. బంగ్లాదేశ్ యుద్ధాన్ని ఆసరాగా చేసుకొని పాక్ ఆక్రమిత భూభాగం విడుదలకు నాటి ప్రభుత్వం ఎందుకు డిమాండ్ చేయలేకపోయింది? ఈ వైఫల్యానికి కారణం ఎవరు? అనే అంశాలు ఆలోచించవలసి ఉంది. 1964లో చైనా దురాక్రమణ జరిపితే అడ్డుకోలేకపోయాం. తిన్‌బిఘాను మన ప్రభుత్వాలే స్వయంగా ధారాదత్తం చేశాయి. దేశసరిహద్దులు కుంచించుకుపోతున్న స్థితి నుండి దేశాన్ని కాపాడాలనే స్పృహను సమాజంలో కల్పించవలసిన అవసరం ఉంది.

సరిహద్దుల సమస్య యిలా ఉంటే అంతర్గత విషయాలు మరీ దారుణంగా ఉన్నాయి. అనేక అక్రమాలు, కుంభకోణాలు జరుగుతున్నాయి. విచారణ సంఘాలు, కోర్టు కేసులు దోషులెవరో తేల్చలేకపోతున్నాయి. దోషులను నిర్ణయించి, శిక్షించే వ్యవస్థలుసమాజంలో లేకపోవడమే యిందుకు కారణం. ముస్లిం, క్రైస్తవ మత మార్పిడులు సమాజాన్ని అతలాకుతలం చేస్తున్నాయి. ఈ స్థితిలో సంఘపరివార సంస్థలు కీలకమైన పాత్ర పోషించవలసి ఉంది. రానున్న మూడేళ్లలో గణనీయమైన పరివర్తన తేగలమన్న ప్రగాఢ విశ్వాసం మనకున్నది. సంస్కారవంతమైన వ్యక్తుల ద్వారా నైతిక విలువల కోసం జీవించే వ్యక్తి నిర్మాణం చేయగలుగుతాం. అందుకు ప్రతి కార్యకర్తా దీక్షాబద్ధుడు కావాలి.

## ఆత్మ-అమరం-సత్యం

మనిషికి మృత్యువు సంప్రాప్తిస్తుంది. కాని అతని సత్కృతులు (సత్కార్యాలు) సజీవంగానే ఉంటాయి. సత్కృతులు ఈ మర్త్యలోకంలో అమరతా[illegible]న్ని ప్రసాదించే అపూర్వ రసాయనాలు. ఈ సత్కృతిని లవలేశమైనా గ్రహించ[illegible]నా ఆత్మ అమరమైనదన్న సత్యం ప్రకటితమ[illegible]తుంది.

**- స్వాతంత్ర్య వీరసావర్కర్.**



స్వర్ణోత్సవ స్ఫూర్తి

# ధర్మం-మర్మం

- శ్రీ ఐతా చంద్రయ్య

"స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః"

అంటుంది భగవద్గీత. సొంత ధర్మాన్ని ఆచరించడమే శ్రేయస్కరము. పరధర్మాచరణ భయానకమైంది.

ఆనాడు పదవుల కాశపడిన రాజామాన్‌సింగ్, రాజా తొడర్‌మల్ లాంటి రాజపుత్రులు స్వధర్మాన్ని కించపరిచి విధర్మీయుడైన అక్బరు పాదుషా కొలువులో పదవుల నలంకరించారు. హిందూ ధర్మం పాలిట చాప కింది నీరైన అక్బరుతో నెయ్యం నెరపి వియ్యాలకు దిగారు. తమ కన్యలను అక్బరుకిచ్చి వివాహం చేశారు. కాని ఒక్క ముస్లిం కన్యనైనా వీళ్లు పెళ్లాడలేకపోయారు. దేశ చరిత్రలో చరిత్రహీనులుగా మిగిలారు.

స్వాభిమానధనుడు, ధర్మరక్షకుడైన మహారాణా ప్రతాప్ చేత అక్బరు పాదుషా సార్వభౌమాధికారాన్ని అంగీకరింపజేయాలని దూతగా రాజామాన్‌సింగ్ వచ్చారు. రాణాప్రతాప్‌ను ఒప్పించలేకపోయాడు.

పూజాదులు ముగించుకొని భోజనానికి కూచున్నాడు. ఇంటి యజమాని అతిథితో కలిసి భోంచెయ్యడం హిందూ ధర్మాచారం. మాతృద్రోహియైన మాన్‌సింగ్‌తో కలిసి భోంచెయ్యనన్నాడు రాణా ప్రతాప్. తీరని అవమానంతో మాన్‌సింగ్ వెళ్లిపోయాడు. రెండు లక్షల సైనిక బలగంతో తిరిగి వచ్చి ఇరవై రెండు వేల సైనిక బలమున్న రాణా ప్రతాప్‌తో హల్దీఘాట్ వద్ద తలపడ్డాడు. ఎన్ని ప్రయత్నాలు చేసినా రాణాప్రతాప్‌ను బంధించలేకపోయాడు. వెర్రిమొహం వేసుకొని వెనుదిరిగాడు. అడవిలో కందమూలాలు తింటూ భార్యాబిడ్డలతో, స్వతంత్రంగా జీవిస్తూ, కష్టాల్లో గూడా స్వధర్మాన్ని మరువలేదు రాణాప్రతాప్. బలంపుంజుకుని మళ్లీ విజృంభించాడు. ఎన్నో కోటల్ని జయించాడు. తిరిగి రాజయ్యాడు. కాని మాన్‌సింగ్ మాత్రం సాటి రసపుత్రవీరులతో ఛీ కొట్టించుకున్నాడు. చీడపురుగన్పించుకున్నాడు.

రోజూ శివపూజ చెయ్యనిదే పచ్చి మంచి నీళ్లైనా తాగని రాజాజైసింగ్ స్వధర్మ రక్షణ మరిచాడు. హిందూ ధర్మ వినాశనానికి కంకణం కట్టుకున్న ఔరంగజేబు ఆస్థానంలో పదవి పొందాడు. కాశీ విశ్వనాథాలయాన్ని కూలగొట్టి మసీదు కడుతూంటే కళ్లప్పగించి చూశాడు. వీర శివాజినెదిరించి భంగపాటు చెందాడు. సమకాలీన రసపుత్ర వీరులతో భీరువన్పించుకున్నాడు. మానహీనుడిగా చరిత్రలో మిగిలాడు.

నేడు గూడా మన దేశంలో అలాంటి నేతలున్నారు. కుహనా సెక్యులరిజాన్ని జపిస్తూ, పదవులు కాపాడుకుంటున్నారు. మెజారిటీ హిందువులకు లేని హక్కుల్ని మైనారిటీ మతస్తులకు కట్టబెడ్తున్నారు. హిందూ దేశంలోనే హిందువుల్ని రెండో తరగతి పౌరులుగా తయారు చేస్తున్నారు. ఈ ధర్మభ్రష్టుల చరిత్రను భవిష్యత్తు ఏ సిరాతో రాస్తుందో మానమూహించుకోవచ్చు. రాబోవు హిందూశతాబ్దిలో ఈ చీడపురుగులు ఏ పేడలో దాక్కుంటాయో చూద్దాం. వీరు పేడ పురుగులే అని చరిత్రలో వ్రేలెత్తి చూపిద్దాం.

✳

మన దార్శనికులు

# శ్రీ అరవిందులు

- శ్రీమతి వి. శ్యామలా దేవి.

*(1950 డిసంబరు 5వ తేది శ్రీ అరవిందుల నిర్యాణం)*

1872వ సంవత్సరం ఆగష్టు 15వ తేదీన యోగి అరవిందులు కలకత్తా నగరంలో జన్మించారు. తండ్రి కృష్ణధన్‌ఘోష్. పాశ్చాత్య నాగరికత మక్కువలో పడి తన కుమారులకు భారతీయ సంస్కృతీ గంధం అంటకుండ బాల్యంలోనే చదువుల నిమిత్తం ఇంగ్లండుకు పంపించాడు. అక్కడ అరవిందఘోష్‌ను సెయింట్ పాల్సు పాఠశాలలో చేర్పించాడు. ఆ పాఠశాలలో ఆంగ్లంలో చిన్నతనంలోనే అపార పాండిత్యాన్ని అరవిందులు సాధించారు. ఆ తరువాత కేంబ్రిడ్జ్‌లోని కింగ్స్ కళాశాలలో పై చదువులు పూర్తి చేశారు. 1893లో భారతదేశానికి తిరిగి వచ్చి బరోడా మహారాజు వద్ద భూమి, రెవిన్యూ, తదితర విభాగాలలో ఉద్యోగం చేశారు. రాజావారి కళాశాలలో ఆంగ్ల భాషాచార్యులుగా పని చేశారు. ఈ సమయంలోనే వారు హిందూదేశాన్ని, జాతిని, ధర్మాన్ని, సంస్కృతిని, చరిత్రను, రాజకీయాలను గురించి కూలంకషంగా అధ్యయనం చేశారు. 1904లో యోగ సాధన చేసి అపూర్వ అనుభూతులను పొందారు. వంగదేశ విభజనోద్యమం ప్రేరణతో ఉద్యోగానికి రాజీనామా చేసి రాజకీయరంగంలో స్వతంత్రంగా ప్రవేశించారు. వందేమాతరం పత్రిక స్థాపించి ప్రజల్లో చైతన్యాన్ని సృష్టించారు. బ్రిటిష్ వారి గుండెల్లో గుబులు పుట్టించారు.

బ్రిటిష్ ప్రభుత్వం వీరి కార్య కలాపాలనరికట్టడానికి అరవిందులను ఆలీపూర్ బాంబు కుట్ర కేసులో ఇరికించింది. ఒక సంవత్సర కాలం జైలులో బంధించింది. జైలులో ఆయన యోగసాధన చేసి విశ్వంలో పరిభ్రమిస్తున్న మహర్షుల, దార్శనికుల, వీరుల ఆత్మలతో సంభాషించారు. శ్రీకృష్ణుని ఆత్మ సాక్షాత్కరింపజేసుకుని 18 యోగాల భగవద్గీతానంతరం ఆ పరమాత్ముని ప్రేరణతోనే పూర్ణ యోగ రచనకు ప్రణాళిక వేసుకొని ఆ తరువాత పూర్తి చేశారు.

ఆయన మీద మోపిన నేరం నిరూపితం కాకపోవడంతో ప్రభుత్వం ఆయన న్యాయవాది దేశబంధుచిత్తరంజన్‌దాస్ వాదన పటిమకు తట్టుకోలేక వదలి వేయడం జరిగింది. ఆ తరువాత ఆయన రాజకీయ రంగం వదలి వేసి ఆధ్యాత్మికరంగంలో ప్రవేశించారు. 1910లో దక్షిణ హిందూ దేశం వచ్చి పాండిచ్చేరిలో ఆశ్రమం స్థాపించుకొని స్థిరపడ్డారు. 1914వరకు నిశ్శబ్దయోగసాధనలో ఉండి నాలుగు సంవత్సరాలు తత్త్వ శాస్త్ర మీమాంసలతోనే గడుపుతూ మౌనవ్రతాన్ని పాటించి, ఆ తరువాత "ఆర్య" అనే ఆధ్యాత్మికమాసపత్రికను స్థాపించి అనేక తాత్వికవైజ్ఞానికాంశాలను ప్రచారం చేశారు. ఆయన ప్రతి రచనలో అంతః ప్రకృతి

ప్రస్ఫుటిస్తుంది. యోగసాధన శక్తి, భారతీయ సంప్రదాయ మూల్యాలు వారు విశేషంగా ప్రచారం చేశారు. ఏడు సంవత్సరాలకు అంటే 1921లో బ్రిటిషు ప్రభుత్వం ఆర్య పత్రికను నిషేధించింది.

యోగంలోని అపూర్వ అనుభవాలను ఆధునిక జీవనానికి జోడించి మానవునికి పరమోత్తమ శాంతి మార్గాన్ని వారుపదేశించారు. వారు తమ భావాలను శ్రీ అరవిందుల లేఖల పేరిట విశ్వ మానవాళి ముందుంచారు. అవి అగాధ జ్ఞాన పుంజాలు. వాటికి విలువ కట్టలేము. జీవితంలోని లోయలను ఉన్నత శిఖరాలను ఆ భావాలు స్పృశించి మనిషిని అతీతశక్తి వైపుగా పయనింపజేస్తాయి.

అరవిందులు గొప్పకవి. ఊర్వశి, ప్రేమ, మృత్యువు తదితర కావ్యాలు ఆయన ఆంగ్ల సాహిత్య పథంలో పాథేయాలుగా నిలిచాయి. ఎన్నో నాటకాలు రచించారు. ఆయనకు కీర్తి కిరీటం పెట్టిన మహాకావ్యం సావిత్రి. అది ఇరవైనాలుగు వేల పంక్తులున్న సుదీర్ఘకావ్యం. మనిషి మృత్యువును జయించవచ్చు అని నిరూపించిన కావ్యం. దివ్య జీవనం మరొక గద్యకావ్యం. ఇదీ సావిత్రీ రెండూ అర్థం చేసుకోడానికి ఒక జీవిత కాలం సరిపోదంటారు. మేధావులు "మాఘేమేఘే గతం వయః" అన్నట్లన్నమాట. ఆ మహాకవి, ఆ విప్లవయోగి, ఆ మహాదార్శనికుడు పూర్ణకుంభయోగ సిద్ధాంత ప్రవక్త, అఖండ భారతదర్శన విజ్ఞానవేత్త 1950 డిసెంబర్ 5వ తేదీన పరమపదించారు. అయితేనేం, ఆయన అజరామర భావాలు ప్రపంచానికి నిత్యదీపికలై కాంతినిస్తూనే ఉన్నాయి. ఆ కాంతి పథంలో పయనించడమే తరువాయి.

## విరోధం ఏర్పడ్డా మర్యాద మరువరాదు.

అది మహాభారత యుద్ధరంగం. భీష్ముడి అర్జునుడు ఒకరికొకరు ఎదురుపడ్డారు. అయిదు బాణాలను భీష్ముని పాదాల వద్దకు గురి పెట్టి వదిలాడు అర్జునుడు. అమోఘాలైన అర్జునుడి బాణాలు భీష్ముని వక్షస్థలాన్ని తగులక, పాదాల వద్ద పడటం చూసి రథసారథి ఆశ్చర్యచకితుడయ్యాడు. అది చూచి "నాకు ప్రియతముడైన అర్జునుడు తన పంచప్రాణాలతోనూ నా పాదాల వద్ద మోకరిల్లి నా ఆశీస్సులను కోరుతున్నాడు" అన్నాడు భీష్ముడు.,

ఈ సంఘటన ద్వారా మనకో నీతి తెలుస్తోంది. మన పెద్దలతో ఎప్పుడైనా అనుకోకుండా ఆదర్శపరమైన విషయాలలో విరోధం ఏర్పడప్పటికీ, వారి పట్ల మనం పాటించే మర్యాద పూర్వకమైన నడవడిలో ఎట్టి మార్పు రానక్కరలేదు.

- రుక్మిణీ, సంతోష

(విశ్వవాస్తు)

# ఇంటికి ఈశాన్యము - మనిషికి మరో ప్రాణం - 2

- శ్రీ వాస్తురెడ్డి

ఈశాన్యం, ఎత్తులు, దిబ్బలు, బరువులు, రాళ్ళ గుట్టలు :

ఎత్తు పల్లాల విషయానికొస్తే ఇంటిలో అష్టదిక్కుల్లో అన్నింటికన్నా పల్లంగా ఉండవలసిన దిక్కు ఈశాన్యం. అలాంటి ఈ శాన్యం ఎత్తుగా ఉన్నప్పుడు సహజంగానే నైఋతి పల్లం అవుతుంది. ఫలితంగా ఎత్తు పల్లాల పొత్తు కుదరక ఈశాన్యం లోపభూయిష్ఠమై విపత్తు లేర్పడతాయి. ఈశాన్యం మిగతా దిక్కుల కన్నా ఎత్తుగా ఉన్నప్పుడు అభివృద్ధికి ఆటంకం ఏర్పడుతుంది. అనుకున్న పనులు సజావుగా సాగవు. ఎక్కడి పనులు అక్కడే ఆగిపోతాయి. రావలసిన డబ్బులు సకాలంలో చేతికందవు. మనం ఒక పని సంకల్పిస్తే మరొక పని అవుతుంది. అభివృద్ధి కాస్త ఆటంకాల బాటగా ముళ్లబాటగా మారుతుంది. పిల్లల చదువులకు ఆటంకాలేర్పడతాయి. ఈశాన్యంలో మట్టిదిబ్బలు ఉన్నా ఇలాంటి దుష్ఫలితాలే కలుగుతాయి. బరువులు అంటె, ఇటుకలు, రాళ్లు, ఇనుపవస్తువులు మొదలైన భారమైన బరువు గల వస్తువులు ఈశాన్యంలో ఉంటే ఒక్కసారి దెబ్బలు, గాయాలతో పాటు యాక్సిడెంట్లు గూడా జరిగే అవకాశముంది. ఇక ఈశాన్యంలో రాళ్ళు గుట్టలు ఉంటె ఫలితాన్ని ప్రత్యేకంగా చెప్పవలసిన అవసరం లేదు. ఈ రకమైన ఈశాన్య దోషాలున్నప్పుడు - అభివృద్ధి అత్యున్నత స్థాయి నుండి అధః పాతాళానికి దిగజారుతుంది. అప్పులు కుప్పలు తెప్పలుగా పెరుగుతాయి. సంసారం సాగరం అవుతుంది. బ్రతుకు బండలవుతుంది. ఇంటి యజమాని శారీరకంగా, మానసికంగా దుర్బలుడవుతాడు, ఒక్కోసారి యజమాని మరణచ్ఛాయలను చవి చూడవచ్చు. ఈ రకమైన ఈశాన్య దోసాలు ఖాళీ స్థలానికి ఉన్నా లేదా ఇంటి నిర్మాణంలో ఉన్నా, లేదా వ్యాపార స్థలానికి ఉన్నా లేదా ఫ్యాక్టరీల వంటి వాటికి ఉన్నా ఫలితాలలో, పరిస్థితిలో తేడా ఉండదు. నిర్మాణంలో ఉన్నప్పుడు ఏ రకమైన ఈశాన్యదోషాలేర్పడినా నిర్మాణం ఆగిపోతుంది. ఒక్కోసారి నిర్మాణం పూర్తయినా ఆ తర్వాత బిల్డింగ్ లేదా ఫ్యాక్టరీ మూతబడుతుంది. ఈశాన్యం ఫలితాలు ఎప్పుడు గమ్మత్తుగా ఉంటాయి. ఒక్కోసారి ఈశాన్యం త్రెంపు జరిగినా క్రింది కారణాల వలన అద్భుతంగా యోగించడం జరుగుతుంది. అయితే ఈ యోగించడమనేది ఒక్కతరం వరకే? ఈశాన్యం త్రెంపు ఉన్నప్పుడు కొందరికి సంతానం ఉండదు. ఈశాన్యం త్రెంపు ఉన్నా యోగిస్తుందంటె నైరుతి ఉచ్చమై ఎత్తుగలదై, విపరీతమై బరువులతో కొండలతో, గుట్టలతో కూడి ఉన్నప్పుడు ఈశాన్యం దోషసహితం అయినా యోగిస్తుంది. అయితే అది ఒక్క తరం వరకు అని మరువవగూడదు. ముందు తరాలకు వారసత్వంగా (ప్రత్యేకించి తన రక్తసంబంధులకు) ఆస్తులు సంక్రమించాలంటే ఎటువంటి ఈశాన్యం త్రెంపు ఉండరాదు. ఈ త్రెంపు అనే స్థలానికి లేదా నిర్మాణానికి ఉన్నా సరే దుష్ఫలితాలు తప్పవనడం ఈశాన్యం తప్పుగాదు. దానికి మనమే బాధ్యత వహించి ఈశాన్యదోషాన్ని సవరించుకోవాలి. ◆

# శ్రీరాముడే ఆదర్శం

వ్యక్తి సమష్టిగా రూపొందడానికి కుటుంబమే తొలిమెట్టు - కుటుంబ సభ్యుల మధ్య ఉండే సున్నితమైన తీయని అనుబంధాలను, సమైక్యతను ఎల్లప్పుడూ చక్కగా నిలుపుకునేందుకు గాను, ఆ కుటుంబ సభ్యులుగా మనం వివిధ కర్తవ్యాలను సరిగా నిర్వర్తించాలి. కుమారుడుగా, సోదరుడుగా, భర్తగా, తండ్రిగా.... ఇంకా ఏ ఇతరమైన బాంధవ్యం కలిగి ఉన్నా మనం మాత్రం, ఒక ఉదాత్త గృహస్థ జీవితం యొక్క ఆదర్శాన్ని మనలో నిలుపుకోవాలి. అప్పుడు మనం కుటుంబానికి, వంశానికే మాత్రమే కాకుండా సమాజానికే ఆదర్శప్రాయులమవుతాము. ఇందుకు శ్రీరాముడే తార్కాణం. శ్రీరామచంద్రుడుపదహారేళ్లు నిండక ముందే, తండ్రి ఆజ్ఞానుసారం రాక్షస సంహారానికి విశ్వామిత్రుడి వెంట అడవికి వెళ్లాడు. ఆ తర్వాత తండ్రిమాట వమ్ము కానీయకుండా ఉండడం కోసం సంతోషంగా పద్నాలుగేండ్లు వనవాసానికి బయలుదేరాడు. సోదరుడుగా అతడు లక్ష్మణుని పట్ల గాఢమైన అనురాగం చూపాడు. ఒక ఆదర్శమిత్రుడుగా సుగ్రీవునితో మైత్రి నెరపాడు. అందుకే ఆయన ఒక ఆదర్శపుత్రుడు, ఒక ఆదర్శ సోదరుడు, ఒక ఆదర్శభర్త, ఒక ఆదర్శమిత్రుడు, ఒక ఆదర్శశిష్యుడు. శత్రువుల కతడొక ఆదర్శవైరి. ఆయనలో ఆదర్శ హిందూ పురుష లక్షణాలన్నీ ప్రస్ఫుటమయ్యాయి. *




# స్వామి హెచ్చరిక

"పాశ్చాత్యుల మార్గమే సరియైనది, కాకపోతే వాళ్లంత గొప్పవాళ్లు ఎలా అయ్యారు! అని నూతన భారతం ప్రశ్నిస్తూ ఉంటే, ప్రాచీన భారతం - క్షణంలో మాయమయ్యే మెరపు; ఎక్కడలేని కాంతీ కలిగి ఉంటుంది; అది ఒక్క క్షణమే ఉంటుందన్న సంగతి మరచిపోగూడదు. అటువంటి మెరుపే నీ కళ్లను మోసగిస్తోంది? జాగ్రత్త అని హెచ్చరిస్తోంది." ఇది నూతన భారతం ప్రశ్నకు ప్రాచీన భారతం హెచ్చరిక అన్నమాట.

**- స్వామి వివేకానంద**




చిన్నకథ

# నక్కపిల్ల - సింహం పెంపకం

- శ్రీహరినాథశర్మ

ఒకప్పుడొక ఆడసింహం అడవిలో తిరుగుతూ నక్క పిల్లను చూసింది. జాలిపడి తనతో గుహకు తెచ్చుకుంది. తన బిడ్డలతో పాటు ఆ నక్క పిల్లకు గూడా తన పాలిచ్చి పెంచసాగింది. సింహం పిల్లలూ, నక్కపిల్లా క్రమంగా పెరుగుతూ అన్నదమ్ముల్లా ఆడుకుంటున్నాయి. ఒకసారి అడవిలో ఆడుకుంటున్న వీటికి ఏనుగు కనిపించింది. అంత పెద్ద జంతువును చూడటంతోనే నక్కపిల్ల హడలిపోయి పారిపోదామని ఏడవడం మొదలు పెట్టింది. "ఇంత కాలానికి ఇటువంటి చక్కని వేట మనకు లభించింది. భయమైతే నీవు ఇంటికిపో. దాని సంగతి మేము చూసుకుంటాం" అన్నాయి సింహం పిల్లలు.

నక్క పిల్ల ఉరుకులు, పరుగులతో గుహకు చేరింది. తన పెద్దరికాన్ని లెక్క చేయకపోవడం వల్ల తమ్ముళ్లకు ఎంతటి కష్టం వచ్చిందో తల్లికి వివరించింది. అందుకే సింహం తల్లి చిరునవ్వు నవ్వి "నాయనా నాపాలే త్రాగి పెరిగావు, కాని నీ జాతి లక్షణం మాత్రం మారలేదు" అంది.

***(నీతి:ఒక దేశంలో పుట్టినంత మాత్రాన గానీ లేదా పెరిగినంత మాత్రానగానీ తదనుగుణమైన మానసిక స్థితి లేనంత కాలం, ఏ వ్యక్తికైనా ఆ భూమిలో జాతీయుడయ్యే అర్హత లభించదు. మానసికంగా అంకితం కావడమే జాతీయతను నిర్ణయించే సరైన సూత్రం)***



## స్వామిశ్రద్ధానంద హత్య



1926 డిసెంబర్ 23వ తేదీన అబ్దుల్ రషీద్ అనే మతోన్మాది స్వామిశ్రద్ధానందను హత్య చేశాడు. స్వామీజీ ఉత్తర మధ్యాభారతాల్లో శుద్ధి కార్యక్రమాల ద్వారా ఎందరో హిందువులను కాపాడగలిగారు. ముస్లింలు అధికార బలంతో, జులుంతో మతాంతరీకరణ చేసిన హిందువులెందరో శుద్ధిపొంది ధార్మిక కార్యక్రమాలలో పాల్గొంటున్నారు. ఇది చూచి కన్ను కుట్టిన కొంతమంది ముస్లింల ముల్లాల ప్రేరణతో అబ్దుల్ రషీద్ అనే మతోన్మాద గుండా అస్వస్థులుగా ఉండి తమ ఆశ్రమంలో విశ్రాంతి తీసుకొంటున్న స్వామీజీ దగ్గరికి వచ్చి భక్తునిలాగా నటించి పాదప్రణామం చేసి, తనను ఆశీర్వదిస్తున్న స్వామీజీపై పిస్టల్ పేల్చి హత్య చేశాడు. ఆ తర్వాత రషీద్ పట్టుబడ్డాడు బ్రిటిష ప్రభుత్వం అతనికి ఉరిశిక్ష విధించింది. అయితే ముస్లింలు అతని సమాధిని గాజీ వీరుని సమాధిగా ప్రకటించి ఈనాటికి పూజలు చేస్తుంటారు.

దేశీయం

# చూసి నేర్చుకో

- శ్రీవాణి

అది లండన్ మహానగరానికి చేరువలో ఒకపల్లె. ఆ పల్లెలో ఒక కుటుంబం కాపురముండేది. తల్లి తండ్రి కొడుకు ముగ్గురు సభ్యులు గల చిన్న కుటుంబమది. కొడుకు పెరిగి పెద్దవాడయ్యాడు. కానీ ఏ పనీ చేసేవాడు కాదు. ఎవరైనా మందలిస్తే తనకు పని గండం ఉందనేవాడు. కొడుకు ఏనాటికైనా మారతాడనేఆశతో తల్లిదండ్రులు చాలా కాలమే ఎదురు చూశారు, నచ్చజెప్పారు. బతిమలాడారు. బెదిరించారు. అయినా మార్పు రాలేదు. విసుగెత్తిపోయిన తండ్రి ఓ నాడు కోపించి కొడుకును ఇంట్లో నుంచి వెళ్లగొట్టాడు. ఏమైనా సంపాదిస్తే తప్ప తిండి పెట్టవద్దని భార్యను ఆదేశించాడు.

విధిలేని పరిస్థితిలో ఆ యువకుడు లండన్ బయలుదేరాడు. ఆ ఊరి నుండి లండన్ వెళ్లాలంటే నదిని దాటాలి. పడవనెక్కాడు. ఎక్కడికి వెళ్ళాలి? ఎందుకు? ఏం చేద్దామనుకుంటున్నావు? ఇత్యాది ప్రశ్నల ద్వారా యువకుడిని గూర్చి తెలుసుకున్న పడవనడిపే వ్యక్తికి అతని పట్ల జాలి కలిగింది. వెంటనే ఓ చిరునామా చెప్పి అక్కడికి వెళ్లమన్నాడు. ఏదైనా పని చేసే మార్గం దొరుకుతుందన్నారు. అక్కడున్న తన మిత్రుడికి లేఖ వ్రాసి, అతడిని కలవమన్నాడు. సంపాదించడం ప్రారంభించాక ఆదాయంలో 30 శాతం ధర్మకార్యాలకు సమర్పించాలని షరతు విధించాడు.

ఆ పెద్దమనిషి సూచించిన స్థలానికి చేరుకున్న యువకుడు క్రొవ్వత్తులు తయారు చేయడం నేర్చు కున్నాడు. తయారైన క్రొవ్వత్తులు అతి తక్కువ ధరకు చర్చికి విక్రయించాడు. వచ్చిన ఆదాయంలో 30 శాతం చర్చికే యిచ్చేశాడు. ధర తక్కువగా ఉండడం, చర్చ్ ప్రోత్సాహం లభించడంతో అతని వ్యాపారం బాగా పుంజుకుంది. ఇచ్చిన మాట ప్రకారం వచ్చిన ఆదాయంలో30 శాతం యిస్తూనే ఉన్నాడు. క్రమక్రమంగా వ్యాపారం పెరిగింది. ఇతర రంగాలకూ విస్తరించింది. టూత్‌పేస్టులూ, పౌడర్లు, డిటర్జెంట్ సబ్బులు, పౌడర్లు తయారు చేయడం ప్రారంభించాడు. బాగా గిరాకీ పెరిగింది. అయినా మాట తప్పకుండా 30 శాతం చర్చ్‌కు యిస్తునే ఉన్నాడు. ఆ యువకుడి పేరు కాల్గెట్. ఆయన కంపెనీల ఉత్పత్తులకు మన దేశంలోనూ గిరాకీ బాగానే ఉంది. వచ్చే ఆదాయంలో 30 శాతం చర్చి కార్యక్రమాలకు వెళుతూనే ఉంది.

ఈ కథ ద్వారా మనకు రెండంశాలు తెలుస్తున్నాయి. కాల్గేట్ ఉత్పత్తులను మనం కొనుగోలు చేయడం వల్ల మన డబ్బులో కొంత భాగం మత మార్పిడులకు ఉపయోగపడుతోంది. అంటే మన ధనంతో మన ధర్మానికే హాని వాటిల్లుతుంది. కాబట్టి ఆ ఉత్పత్తులను హిందువులంతా నిషేధించాలన్నది మొదటి అంశం కాగా మనం కూడా మన ఆదాయంలో కొంత భాగం హిందూధర్మ రక్షణకు కేటాయించాలన్నది రెండో అంశం. దీని వల్ల మనం నష్టపోయేదేమీ లేదు. ఆదాయంలో కొంత మాత్రమే తగ్గుతుంది. కానీ దేశం పటిష్ఠమవుతుంది. ధర్మరక్షణ జరుగుతుంది. ధర్మం రక్షింపబడితే నీవూ రక్షింపబడ్డట్లే

*

## ❖ శ్రీ గురూజీ వేకువ వెలుగులు గ్రంథావిష్కరణం

నవయుగ భారతి ఆధ్వర్యంలో 97 నవంబర్ 16వ తేదీన కేశవ మెమోరియల్ విద్యాలయప్రాంగణంలో శ్రీ భండారు సదాశివరావు రచించిన 'శ్రీ గురూజీ' జీవిత చరిత్ర గ్రంథం, రాష్ట్ర కవి డా॥ ఓగేటి అచ్యుతరామశాస్త్రి రచించిన 'వేకువవెలుగులు' (ఆంధ్రప్రదేశ్‌లో తొలితరం సంఘ ప్రచారకులు) అనే గ్రంథం ఆవిష్కరణోత్సవ కార్యక్రమం జరిగింది. గ్రంథాల ఆవిష్కరణలో ఓ మైలు రాయిలాంటి ఉత్సవం ఇది. దాదాపు పదిహేను వందల మంది పాల్గొన్న ఈ ఆవిష్కరణోత్సవంలో ఈ రెండు గ్రంథాలను అఖిల భారత ఆర్.ఎస్.ఎస్ ప్రముఖులు మాన్య శ్రీ మోరోపంత్ పింగళే ఆవిష్కరించి హిందూ సంఘటనావశ్యకత గురించి వివరించారు.

సభకు అధ్యక్షత వహించిన ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయమూర్తులు మాన్య శ్రీ ఎస్. పర్వతరావు జీవిత చరిత్రలు ఉత్తమ సందేశాలనిచ్చి మార్గదర్శనం చేస్తాయన్నారు. ఈ గ్రంథాల తొలి ప్రతులను శ్రీ జి. పుల్లారెడ్డి, శ్రీ సోమరాజు స్వీకరించారు. నవయుగ భారతి అధ్యక్షులు ప్రముఖన్యాయవాదులు శ్రీ ఎస్.ఎన్. మూర్తి పరిచయం చేశారు. శ్రీ గురూజీగ్రంథాన్ని డా॥ కసిరెడ్డి, వేకువ వెలుగులు గ్రంథాన్ని శ్రీ టి. హరిహరశర్మ పరిచయం చేశారు. ప్రారంభంలో శ్రీ వడ్లమూడి రామమోహన రావు స్వాగతం పలికారు. చివరలో శ్రీ వి. రామకృష్ణ వందన సమర్పణ చేశారు.

## ❖ 1997 డిసంబర్ 6 శౌర్యదివస్

1997 డిసంబర్ 6వ తేదీన దేశమంతటా హిందూ బంధువులందరూ శౌర్యదివస్ జరుపుకుంటున్నారని, మన ప్రాంతంలో అంతటా శౌర్యదివస్ జరుపుకోవాలని పరిషత్ పిలుపునిచ్చింది. విశేషాలకు ఈ పత్రికలోనే పిలుపును ఇచ్చాం; చూడండి!

## ❖ జ్యోతిష విజ్ఞానం పై సదస్సు

1997 నవంబర్ 20వ తేదీన జాతీయ సాహిత్య పరిషత్ ఆధ్వర్యంలో సాహిత్యంలో జ్యోతిష విజ్ఞానం అనే అంశం పై భాగ్యనగర్లోని విజయ శ్రీ భవనంలో సదస్సు జరిగింది. సభకు అధ్యక్షత వహించిన విశ్వ హిందూ పరిషత్ ప్రాంత అధ్యక్షులు డా॥ ఎం.వి.ఆర్. శర్మ కాలాన్ని గుర్తించడంలోజ్యోతిషానికున్న ప్రాధాన్యాన్ని వివరించారు. పౌరాణిక సాహిత్యానికి జ్యోతిష విజ్ఞానం ఏ విధంగా మూలమై నిలిచిందో వివరిస్తూ అనేక శాస్త్రీయాంశాలను సోదాహరణంగా వివరించారు. ఉపన్యాసానంతరం చర్చలో డా॥ కసిరెడ్డి, ఆచార్య వేణు, శ్రీ మాదిరాజు హరినందన్ పాల్గొన్నారు. శ్రీమతి పి. సరళ,శ్రీమతి చంద్రావతి స్వీయకవితలు వినిపించారు.

## ✤ జాగృతి స్వతంత్రభారత స్వర్ణోత్సవ సాహిత్య సంచిక ఆవిష్కరణ

1997 నవంబర్ 1వ తేదీన దీపావళి పర్వదినాన్ని పురస్కరించుకొని స్వతంత్ర భారత స్వర్ణోత్సవ సాహిత్య ప్రత్యేక సంచిక ఆవిష్కరణ జరిగింది. జాగృతి వారపత్రిక ప్రాంగణంలో ఈ ఆవిష్కరణోత్సవం జరిగింది. ఈ సంచికలో స్వాతంత్ర్య సమరానికి దోహదంచేసిన తెలుగుసాహిత్యంపై ఎందరో రచయితలు వ్రాసిన వ్యాసాలున్నాయి.

## ✤ రాజకీయాలకు అతీతంగా ఆలయాల నిర్వహణ

దేవాదాయ ధర్మాదాయశాఖ గుర్తింపు ఉన్న దేవాలయాల కమిటీలను తెలుగుదేశం పార్టీ నాయకులతో ఏర్పాటు చేయాలన్న యోచన తగదని విశ్వహిందూ పరిషత్ రాష్ట్రప్రభుత్వాన్ని హెచ్చరించింది. నవంబర్ 16,17 తేదీల్లో అహోబిలంలో జరిగిన ప్రాంత కార్యవర్గ సమావేశంలో దేవాలయాల నిర్వహణను రాజకీయాలకు అతీతంగా ఉంచాలని కోరుతూ ఒకతీర్మానాన్ని ఆమోదించారు. పదవులు రాని నియోజకవర్గ స్థాయి టిడిపి కార్యకర్తలను ఆలయ కమిటీల్లో నియమించాలని పార్టీ నిర్ణయించినట్లు వచ్చిన వార్తల పట్ల పరిషత్ కార్యవర్గం ఆందోళన వ్యక్తం చేసింది. ప్రభుత్వం దేవాలయాల నిర్వహణ,ఆస్తిపాస్తుల భద్రత రాజకీయాలకు అతీతంగా ఉంచి కాపాడాలని, లేని పక్షంలో ఆస్తికులైనప్రజలను సమాయత్తం చేసి ధర్మబద్ధమైన పోరాటం చేస్తామని పరిషత్ హెచ్చరించింది. ప్రాంతమత మందిర విభాగ్ ప్రముఖ్ శ్రీ కోసూరి వేంకటేశ్వరరావు ప్రవేశపెట్టిన ఈ తీర్మానాన్ని కార్యవర్గం ఏకగ్రీవంగా ఆమోదించింది.

## ✤ ఝాన్సీ లక్ష్మీబాయి జయంతి

కడపజిల్లా చాపాడుమండలం శ్రీరాములు పేట ఝాన్సీలక్ష్మీ బాయి మాతృమండలి ఆధ్వర్యంలో ఝాన్సీలక్ష్మీబాయి, గురునానక్‌ల జయంత్యుత్సవ సమ్మేళనం జరిగింది. శ్రీ అల్లాడుపల్లి వీరభద్ర క్షేత్రంలో జరిగిన ఈ కార్యక్రమానికి శ్రీ వీరభద్ర జూనియర్ కళాశాల తెలుగు లెక్చరర్‌మామిళ్ల మల్లీశ్వరి అధ్యక్షత వహించగా, ఇంగ్లీషు లెక్చరర్ కృష్ణప్రసాద్ ముఖ్య అతిథిగా హాజరయ్యారు. వి.హిం.ప. పశ్చిమాంధ్ర ప్రాంత సహకార్యదర్శి శ్రీ వంగాల రామిరెడ్డి, జిల్లా ప్రధాన కార్యదర్శి శ్రీ ఎం. శంకరయ్య,సహకార్యదర్శి శ్రీ ఎన్.ఎస్. రాజారావు, ప్రొద్దుటూరు నగర ప్రచారక్ శ్రీ శ్రీనివాస్ తదితరులు కార్యక్రమంలో పాల్గొన్నారు.

# జ్ఞానమే ధర్మం

## శ్లోక వ్యాఖ్యానం

శ్లో॥ ఆహార నిద్రా భయమైథు నంచ - సామాన్య మేతత్ప శుభిర్నరాణామ్
జ్ఞానాన్న రాణా మధికం విశేషమ్- జ్ఞానేన హీనః పశుభిస్సమానః

ఆహారం, నిద్ర, భయం, విషయ భోగం అనే ఈ నాలుగు పశువులకూ మానవులకూ సమానమే. మానవునికి మాత్రం జ్ఞాన మొక్కటి అధికంగా ఉంది. జ్ఞానం లేని మనిషి మాత్రం పశువుతో సమానం.

మనిషికి పశువులకూ ఆహారం కావాలి, నిద్రాకావాలి. ప్రాణ భయముంటే అందరికి భయమూ సమానమే. తృప్తి నిచ్చే సంభోగమూ సమానమే కాని మనిషికి జ్ఞాన మొక్కటి ఎక్కువ ఉన్నది. అందువల్లనే ఇది ధర్మమూ ఇది అధర్మమూ అని నిర్ణయించుకొంటున్నాడు. ఈ నిర్ణయ జ్ఞానము కొందరి కుందనుకొందాం. వారు ఆ జ్ఞానమున్న వారిని ఆదర్శంగా గ్రహించి నడుస్తున్నారు. అందువల్ల జ్ఞానమున్నట్లె లెక్క. ఒకడు మాత్రం మనిషిలా వ్యవహరించడు. అప్పుడతణ్ణి ద్విపాద పశువంటారు.

ఈ నాలుగూ మనుషుల కందని సమాజం కూడా ఉండొచ్చు. అది పశువుల కంటే హీనాతి హీనమైన సమాజంగానే భావించాలి. ఏ వ్యక్తికీ ఈ నాలుగందకుండా ఎవరూ చేయరాదు. అలాచేస్తే మనిషి పిచ్చివాడవుతాడు. పిచ్చి పిచ్చి పనులు చేస్తాడు, చివరకు చస్తాడు. ఈ నాలుగింటిలో తృప్తి లేకపోతే మనిషికైనా పశువుకైనా శాంతి ఉండదు. ఈ నాలుగు పశువు కందుతున్నాయి కాబట్టి అది సుఖంగా ఉంది. నిజానికి దానికీ జ్ఞానం ఉంది. తన పిల్లలకు ఆహారం అందించేప్పుడు, రక్షణకు పూనుకొన్నప్పుడు పక్షులకు-పశువులకు ఆలోచించే శక్తి ఇది చేయాలి, ఇది చేయకూడదు అనే తార్కిక శక్తి ఉంటుంది. ఈ విశేష జ్ఞానమే ధర్మము.

- ధర్మ వీర

## డిసెంబర్‌లో సంస్కార భారతి రథయాత్ర

★ డిసెంబర్ 1997

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1-12-97 | గూడూరు | 2-12-97 | నెల్లూరు | 3-12-97 | బుచ్చిరెడ్డిపాలెం |
| 4-12-97 | పార్లపల్లి | 5-12-97 | కావలి | 6-12-97 | ఒంగోలు |
| 7-12-97 | మార్కాపురం | 8-12-97 | శ్రీశైలం | 9-12-97 | నాగర్‌కర్నూల్ |
| 10-12-97 | కల్వకుర్తి | 11-12-97 | దేవరకొండ | 12-12-97 | నల్గొండ |
| 13-12-97 | మిర్యాలగూడ | 14-12-97 | సూర్యాపేట | 15-12-97 | కోదాడ |
| 16-12-97 | ఖమ్మం | 17-12-97 | కొత్తగూడెం | 18-12-97 | నందిగామ |
| 19-12-97 | విజయవాడ | 20-12-97 | మంగళగిరి | 21-12-97 | గుంటూరు |
| 22-12-97 | నరసారావుపేట | 23-12-97 | చిలకలూరిపేట | 24-12-97 | చీరాల |
| 25-12-97 | బాపట్ల | 26-12-97 | రేపల్లె | 27-12-97 | తెనాలి |
| 28-12-97 | కూచిపూడి | 29-12-97 | మచిలీపట్నం | 30-12-97 | ఏలూరు |
| 31-12-97 | భీమవరం | | | | |

## విశ్వహిందూ మాసపత్రిక - జీవిత సభ్యులు

1. శ్రీ చెక్కా ఆదినారాయణ,
వివేకానందనగర్, జయశ్రీ బేకరి, మల్లయ్యపేట, రాజమండ్రి - పిన్ : 533105

2. శ్రీ పెంటి పూడికపిలనారాయణ మూర్తి,
మారమండ, తూర్పు గోదావరి జిల్లా, పిన్ : 533126

3. డా॥ ఎం.వి.ఆర్. శర్మ, మానస నర్సింగ్ హోమ్
పద్మారావునగర్, సికింద్రాబాదు.

## విశ్వహిందు వాణి

కుటిల రాజకీయ కుమ్ములాటలు మాని
దేశ రక్షణకిదె దీక్షబూని
హిందు జాతి ప్రగతికందరేకముకండి!
విశ్వహిందు వాణి వినుడు వినుడు.

- సుందరం




'శ్రీ గురూజీ' గ్రంథావిష్కరణ మహోత్సవంలో శ్రీ మోరోపంత్ పింగళే, సభాధ్యక్షులు
మాన్య శ్రీ ఎస్. పర్వతరావు మొదటి ప్రతి అందుకొంటున్న శ్రీ జి. పుల్లారెడ్డి,
నవయుగభారతి అధ్యక్షులు శ్రీ ఎస్.ఎస్. మూర్తి, వార్త - లోపటి పుటల్లో



శ్రీ గురూజీ, వేకువ వెలుగులు గ్రంథావిష్కరణ సభలో పాల్గొన్న ఎందరో
ప్రముఖులతో పాటు అశేష జనవాహిని, వార్త - లోపటి పుటల్లో